

లంబాడి వనిత

—ఫొటో : వి. కేశవశర్మ.

# పద్మిని

## తన మనోహరమైన చర్మసౌందర్యము కొరకు

## శుద్ధమైన తెల్లని లక్స్ టాయ్‌లెట్

## సబ్బుపై నాధారపడుచున్నది




పద్మిని ఇట్లు చెప్పుచున్నది:













సినీమా తారలకు సౌందర్యమునిచ్చు శుద్ధమైన తెల్లని సబ్బు

L.TS. 468-X52 TL





































**సన్‌లైట్ సబ్బు** బట్టలు చాలకాలము మన్నునట్లు చేయును

భారతదేశంలో తయారుచేయబడినది

S. 236-X52 TL

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 49
సంచిక 21
**25.1-56**

మన్మథ పుష్య శుద్ధ ద్వాదశి బుధవారం



ఈ నెల 26-వ తేదీ మనకు పర్వదినం. ఆనాడు భారత రిపబ్లిక్ ఆరవ జన్మదినోత్సవం జరుపుకుంటోంది. మొదటి పంచవర్ష ప్రణాళిక త్వరలో ముగిసి, రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభం కాబోతోంది. భారత దేశం సర్వతోముఖంగా అభివృద్ధి సాధిస్తూ, సోషలిస్టు వ్యవస్థవైపు పురోగమిస్తోంది; అంతర్జాతీయ రంగంలో సుస్థిరశాంతికి కృషి చేస్తూ పేరుప్రతిష్ఠలు ఆర్జించింది. రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ప్రధాని నెహ్రూల నాయకత్వాన మనం సాధించిన విజయాలు సర్వదా గర్వకారణం.





భారత రాష్ట్రపతి

# విషయానుక్రమణిక

ముఖ చిత్రం :

విజయభట్ నిర్మిస్తున్న "పత్రాణీ"
హిందీ చిత్రంలో రంజనశుక్లా



(అనివార్యకారణాలవల్ల ఈవారం "వనితాలోకం" శీర్షిక నిలిపివేయవలసి వచ్చినదని మనవి.)

నవభారత సారథి జవహర్లాల్ నెహ్రూ— →

# మహత్తరమైన 3 - వ వారం



# యక్ష పరీక్ష

ప్రాచీన గాథాలహరి

**వి. గణపతిశాస్త్రి**

"అయ్యో! అయ్యో! నా యజ్ఞాగ్ని హోత్రానికి వినియోగించే అరణి ఆ మాయ జింక ఎత్తుకు పోతూంది! ధర్మమూర్తీ! మీరే నాకిక దిక్కు! రక్షించండి! రక్షించండి!"

అని ఆ బ్రాహ్మణుడు దీనంగా వలవలా వాపోయాడు! ధర్మరాజతని ఆర్తనాదం వింటూనే కళ్లెత్తి అటూ ఇటూ పరిశీలించాడు. వెంటనే విల్లమ్ములు చేతబట్టుకుని ఆ జింక వెంటనంటి పరిగెత్తుకు పోయినాడు! మిగిలిన పాండవులందరు అన్నగారావిధంగా ఆత్రంగా పరిగెత్తుకు పోవడం చూసి తాము కూడా మరి వెనక ముందులు చూడకుండా విల్లమ్ములు చేత బుచ్చుకుని ఆ జింక వెంట వెంటనే పరుగులు పెట్టారు! పాండవుల అరణ్యవాసంలో వారి వెంటనున్న మిగిలిన పరివారంలో వారంతా ఏమి చేయడానికి పాలుపోక రెప్పపాటు లేకుండా అలా నిలబడి పోయారు! ఇది అంతా ఒక్క క్షణంలో జరిగిపోయింది!

అప్పటికప్పుడే ఝాము పొద్దెక్కింది. అయినా ఎక్కడా ఎండ పొడకూడా చొరడానికి వీలులేని ఆ కీకారణ్యంలో పక్షులు, మృగాలు మేలుకున్న సందడి అప్పుడే ప్రారంభమయింది. పాండవులు తమ అమ్ములన్నీ ఒకటొకటిగా ఆ జింకమీద ప్రయోగించారు. అయినా అది చెంగు చెంగున ఆకాశంలోని కెగురుతూ అవ్వన్నీ తప్పించుకుని శరవేగంతో పరిగెత్తుకు పోతూంది! ఆ జింక కొమ్ములలో చిక్కుకున్న ఆ అరణిమాత్రం చెక్కు చెదరకుండా అలాగే మెరుస్తూంది. పాపం! ఆ బ్రాహ్మణుడా అరణి ఒక్క గున్నమామిడి కొమ్మలో భద్రంగా దాచుకున్నాడు. ఆ జింక ఎగురుతూ పరుగెత్తుతూంటే అది దాని చిలవలపలవల కొమ్ముల్లో చిక్కుకు పోయింది. దానితో అది అలాగే పరిగెత్తుకుపోయింది!

పాండవులయిదుగురు—"అయ్యో! ఒక్క జింకను వేటాడలేకపోయామే!"అని చాలా ఖిన్నులైపోయారు. అయినా నిరుత్సాహం చెందక చిట్టచివరి ప్రయత్నంగా అయిదుగురూ ఒక్కసారిగా బాణాలు వేశారు! ఆ దెబ్బతో ఆ జింక తలతెగి నేలమీద పడిపోయిందనే అనుకున్నారు. కాని అది చెంగున ఒక్క గెంతేసింది! అంతే! అది తిరిగి నేలమీద అడుగు పెట్టిన జాడ ఎక్కడా కనబడలేదు! ఏమైపోయిందో! ఆ అరణ్యంలో ఆ పరిసరాల్లో ఎంత గాలించినా దాని జాడే పొడగట్టలేదు!

ఈ అపూర్వ సంఘటన కందరు దిగ్భ్రాంతులైనారు! అయినా ఆ అయిదుగురు పాండవులు ఆ అరణ్యంలో ఆ ప్రాంతం అంతా కలయ వెదికారు. ఎక్కడా ఆ జింకజాడే కనబడలేదు!

ఇదంతా జరిగేసరికి మధ్యాహ్నం రెండు యామాలకాలం గడిచిపోయింది! మిట్టమధ్యాహ్నం ఎండ నడినెత్తి మాడ్చి వేస్తూంది. నిరుత్సాహంవల్ల, బడలికవల్ల అందరు అలసిపోయినారు. అతిదాహంవల్ల అందరి నాలుకలు పిడచగట్టుకు పోయాయి! కాని కనుచూపు మేరలో ఎక్కడా నీటిబిందువుకూడా కనిపించే ఆశలేదు! అందరు తమ దురవస్థాపరిపాకం తలుచుకుని దిగాలుపడి పోయారు.

"పాపం! ఆ బ్రాహ్మణునికి అరణికూడా దక్కించలేక పోయాముగదా! ఎంతటి మహావమానం!" అన్నాడు నకులుడొక దీర్ఘనిశ్వాసం విడిచిపెట్టి.

"ద్రౌపదీదేవిని ఆ విధంగా అవమానించినపుడు కౌరవుల నందరినీ సంహరించి వేసి ఉంటే ఇంతటి దురవస్థ సంప్రాప్తించి ఉండేది కాదుగదా!" అన్నాడు భీమసేనుడు తీవ్ర క్రోధంతో! అతని కన్నులు రెండూ రెండు కెంపులైనాయి!

"ఆ సూతపుత్రుడు—ఆ కర్ణుడు—నిండు సభలో ద్రౌపదీదేవి నావిధంగా దుర్భాషలాడుతూంటే సహించి ఊరుకోవడం వల్లనే— నేటికీ దుర్దశవచ్చింది! ఇది సహజమే!" అన్నా డర్జునుడు.

ధర్మపుత్రుడు వారి దైన్యవచనాలువిని లోలోపల చాలా కించపడ్డాడు. దాహం అలాగే అందర్నీ దహించి వేస్తున్నది.

ధర్మరాజు "నాయనా! ఆ చెట్టుపైకెక్కి ఎక్కడైనా కనుచూపు మేరలో సరస్సేదైనా ఉన్నదేమో పరిశీలించిచూడు!" అన్నాడు నకులునితో.

నకులుడు అలిసిఉన్నా సరే లెక్కపెట్టక ఎదురుగాఉన్న పెద్ద చెట్టు చిట్టచివరికొమ్మ ఎక్కి చుట్టూ పరిశీలించి ఎంతో ఉత్సాహంతో కిందికిదిగివచ్చి—"దూరంలో ఒక పెద్ద సరోవరం కనిపించింది!"అన్నాడు.

"సరే! నీవే అక్కడికిపోయి దాహం తీర్చుకుని మాకింత మంచితీర్థం తీసుకురా! నాయనా!" అన్నాడు ధర్మరాజు.

నకులుడు చాలాదూరం నడిచిపోయినాడు. పోగాపోగా కొంతసేపటికి ఆ పెద్ద సరోవరం కనిపించింది. అప్పటికి దాదాపు మూడుయామాలు గడిచిపోయాయి. ఆ సరోవరానికి చుట్టూ దట్టంగా చెట్లు, తీగలు, పొదలు గజిబిజిగా అల్లుకున్నాయి. నకులుడు అవన్నీ దాటిపోయి ఎంతో సంతోషంతో ఆ సరస్సులో దిగినాడు. వెంటనే పెద్ద కంఠస్వరం వినిపించింది. ఆ ధ్వనికి చుట్టూ అడివిలోఉన్న లేళ్లు, కుందేళ్లు మొదలైన మృగాలన్నీ హడలెత్తి దూర దూరంగా పరిగెత్తుకు పోయాయి! సరోవరం ఒడ్డున తేలుతున్న మీనులన్నీ ఒక్కసారి తటాలున నీటిలో మునిగిపోయాయి! ఆ ధ్వని గంభీరంగా భయంకరంగా ఇలాగ వినిపించింది.

"నీవీ మంచితీర్థం పుచ్చుకోవాలంటే ముందుగా నా ప్రశ్నల కన్నిటికీ ప్రత్యు

#  యక్షపరీక్ష 

త్తరా లివ్వాలి! అంతవరకు ఒక్క గుక్కైనా ముట్టడానికి వల్ల పడదు!"

ఈ మాటలు విని నకులు ఒక్క క్షణ కాలం దిగ్భ్రాంతుడైనాడు. కాని విదాహం వల్ల నాలుక పిడచకట్టుకుపోతూంది. "ఈ బెదిరింపులకేమిలే!" అనుకుని ఒక్క గుక్కలో తాగ గలిగినన్ని నీళ్లన్నీ తాగి వేసినాడు!

అంతే! వెంటనే అతనికి మూర్ఛవచ్చింది. మొదలు నరికిన తరువులా అక్కడే పడి పోయాడు!

ఇక అక్కడ ఆ ఆశ్రమంలో మిగిలిన పాండవులు నలుగురు నకులుని కోసం వేచి వేచి విసిగి వేసారి పోయారు! ఇక చేసే దేమీ లేక ధర్మరాజు సహదేవుణ్ణి ఆ విష యం పరిశీలించ వలసిందని పంపించినాడు.

సహదేవుడు అప్పటికే శోష వచ్చి పడి పోయే పరిస్థితిలో ఉన్నాడు. అయినా త్వరితంగా ఆ సరోవరం ఉన్న ప్రదేశానికి బయలుదేరి వెళ్ళాడు.

తిరిగి సహదేవుని రాక కూడా చాలా ఆలస్యం అయింది. వెంటనే ధర్మరాజు అర్జునుని పంపించినాడు.

అతనికి కూడా ఆ సరోవరం దగ్గర ఆ అశరీరవాణి అలాగే అతి భయంకరంగా విని పించింది. వెంటనే ఆ పరిసరం అంతా పరి శీలించి చూచాడు. నకుల సహదేవులిద్దరు ఆ ప్రాంతంలోనే పడి ఉన్నారు. అతని హృదయంలో విషాదము, క్రోధము సంభ్ర మము ఒక్కసారిగా ఉవ్వెత్తుగా పొంగి పోయాయి। వెంటనే శబ్దవేధి శరం ఒకటి వింటసంధించి ఆ ధ్వని వినవచ్చిన దిశవైపున బాణం వేశాడు. కాని ఆ బెదరింపు తిరిగి అలాగే భయంకరంగా వినిపించింది, అర్జును డిక దాహానికి తాళుకోలేక నీళ్లు తాగబో యినాడు. ఆ బెదిరింపు వినిపించినా లక్ష్య పెట్టకుండా ఒక గుక్కెడు నీళ్లతో నాలుక తడుపుకొన్నాడు. వెంటనే వివశుడై నేల మీద పడిపోయినాడు! పిమ్మట అలాగ ఆలస్యం జరిగిన కొద్దీ ధర్మరాజు మనస్సులో భయాందోళన లెక్కువైనాయి. వెంటనే భీమసేనుని పంపించాడు.

అప్పటికప్పుడే సాయంకాలం కావ చ్చింది! ధర్మరాజలాగే అన్నదమ్ముల కోసం నిరీక్షిస్తున్నాడు. అతని హృద యంలో ఒకొక్క క్షణం ఒకొక్క యుగంలా గడిచిపోతూంది. చివరికి భీమసే నుని రాక కూడా బాగా ఆలస్యం అయింది.

గత్యంతరం లేక ధర్మరాజే ఆ సరో వరానికి బయలుదేరినాడు.

ఆ కమలాకరం తీరానికి చేరుకునే సరికి సూర్యాస్తమయం అయింది. అప్పుడే కొంచెం కొంచెం చీకటిపడుతూంది. సరో వరం అంతా నిశ్చలమై, ఒక పెద్ద వెండి అద్దంలా స్వచ్ఛంగా మెరిసి పోతూంది! ఎంత పరీక్షగా పరిశీలించినా అవతలితీరం కనిపించనంతటి విశాల తటాకమది! దానిలో అంతటా రంగురంగుల కలువలు అప్పుడప్పుడే వికసిస్తున్నాయి! చుట్టూరా గుబురులుగా పెరిగిన పెద్ద వృక్షాలా సర స్సులో ప్రతిఫలిస్తూ - అదికూడా ఆ అడ విలో ఒక భాగమేమో అనిపిస్తున్నాయి. ఇంతలో ఒక గుడ్లగూబ దిగులుగా కూసింది! పక్కనే ఒక తామరాకుమీద నిలబడివున్న కొంగ రెక్కలు మెరిపిస్తూ మెల్లిగా అక్కడి నించి ఎగిరిపోయింది. దాని రెక్కల వెలుగు లా కొలనులో తళతళా మెరిసిపోయాయి.

సరిగా ధర్మరాజక్కడికి చేరుకునేసరికి శుద్ధదవితి వెన్నెల వెలుగులు కూడా తోడై ఆ జలాశయాని కొక విచిత్ర సౌందర్యం మేళవించాయి!

ధర్మరాజు అద్భుత తటాకం చూచి తన కన్నులే నమ్మలేకపోయినాడు! వెంటనే అతనికి ఆ పక్కగా పడిఉన్న భీమార్జున నకుల సహదేవులు కనిపించారు. ఆత్రంగా వారిని సమీపించాడు. వారందరు మృతులై వరసగా-నేలమీద పడిఉన్నారు.

ఆ భీభత్సదృశ్యం చూసేసరికి ధర్మపుత్రు నికి మరి తన దాహం మాటే జ్ఞాపకం రాలేదు! వారిదగ్గరకు వెళ్ళి జాగ్రత్తగా వారి ముఖకవళికలు పరిశీలించాడు. కొంప్రాయులై పడిఉన్న వారి ముఖాల్లో జీవ కళ దృశ్యాదృశ్యంగానైనా పొడగట్టలేదు. ఈ ఘోర విపత్పరంపరకు కారకు లెవరో కూడా తెలియలేదు!

అతని హృదయంలో దుఃఖం ఒక్కసా రిగా సముద్ర తరంగంలా పొంగి పరవళ్లు దొక్కింది! 'ఈ అరణ్యవాసంలో తమ కష్టాలు గట్టెక్కె శుభ క్షణం మరి రాదా' అనిపించింది ఆ ధర్మమూర్తికి! ముందు వారి ముఖాలమీద ఇంత శీతలోదకం చిలకరించా లనే తొందరతో ఆ తటాకంలో ప్రవేశిం చాడు! అవిధంగానైనా వారు జీవిస్తారే మోనని అతని ఆశ!

వెంటనే మేఘగంభీరస్వరంతో ఆభయం కర గర్జితం ప్రారంభమైనది! ఆధ్వని బయలు దేరగానే ఆసరస్సులో విశ్రమించిన పక్షులు టపటప రెక్కలాడిస్తూ పైకెగిరిపోయాయి! అశరీరవాణి గర్జన ఇలాగ వినిపించింది.

"నీ సహోదరులు నామాట నిర్లక్ష్యం

> **"ఉన్నదేదో ఇస్తారని..."**
>
> "అయ్యా. పేదవాణ్ణి కాస్త సహాయం చేయించాలి."
>
> "గామాలా ఉన్నావు నీకు సహాయమేమిటోయ్. అయినా కాకపోయినా, నీ క్కావలసినది వెధవ డబ్బు సహాయం కాదు. బుర్రవుండాలి. తెలివి తేటలు అవసరం."
>
> "అంటే మరేం లేదండి. మీ దగ్గిర ఉన్న దేదో, అందులో కాస్త ఇచ్చి సాయం చేస్తారుగదా అని ఆలోచించి, డబ్బే అడుగుతున్నానండి."

చెయ్యడం వల్లనే ఈ దురవస్థ పాలైనారు. ఈ సరోవరం నాది! నా ప్రశ్నలకు ప్రత్యు త్తరా లిచ్చిన తరవాత దాహం తీర్చుకో వచ్చును! లేకపోతే ఎంతటి వారికైనా ఇదే దుర్దశ!"

ఎటు చూచినా ధర్మపుత్రుని కాపరి సరాల్లో ఎక్కడా మానవాకృతి కనిపించ లేదు! తిరిగి క్షణకాలం ఆసరోవరం అంతా పరిశీలించి చూచినాడు. కొంచెం ఆలో చించి—

"ఓ అశరీరవాణీ! ఎవరు నీవు?" అన్నాడు.

"నేనొక కొంగను!"

"అయ్యా! నీ శరీరం నా నేత్రాలకు గోచరం కావడం లేదు. నీవు ఒక రూప ధరుడవైన రుద్రుడవో, పావకుడవో, పవన దేవతవో అయిఉండవలెను! కానివాడు దేవాసుర గంధర్వాదుల కజేయులైన నా సోదరుల నీ విధంగా జయించలేవు!"

"ధర్మపుత్రా! నీవన్నది నిజమే సుమా! నేనొక యక్షుడనే!"

అని అతని కెదురుగా తాళవృక్షం అంతటి దీర్ఘ దేహంతో ఒక మహాపురుషుడు ప్రత్యక్షమైనాడు! అతని కోరలు చంద్ర వంకల్లా తళతళ మెరుస్తున్నాయి! నేత్రాలు చింత నిప్పులా కణకణలాడుతూ మండు తున్నాయి అతని శరీర కాంతులతో ఆసరో



ధర్మదేవత చల్లనివెలుగులు సరోవరంలోను, ఆ పరిసరంలోను అమృతవర్షం జల్లులుగా ప్రసరించాయి.

—చిత్రకారుడు : పి. ఎల్. నరసింహమూర్తి.

# ★ యక్షప్రశ్న ★

శరపరిసరమంతటా పున్నమి వెలుగుల వెల్లువలు నిండిపోయాయి!

ధర్మరాజతనికి నమస్కరించి "మహాత్మా! మీ ప్రశ్నలన్నిటికీ సముచితమైన ప్రత్యుత్తరాలిచ్చే సామర్థ్యం నాకు లేదు. నా శక్త్యనుసారంగా విన్నవించుకొంటాను." అన్నాడు.

యక్షుడు ధర్మరాజు నీవిధంగా ప్రశ్నించినాడు. వెంటనే అతడా ప్రశ్నలకు ప్రత్యుత్తరాలు ఇచ్చినాడు.

"సూర్యదేవుని నడిపించేదేది?"

"బ్రహ్మశక్తి!"

"ఆపత్పరంపరలో జీవుని రక్షించేదేది?"

"ధైర్యం!"

"ధరణికన్నా మహత్తరమైనది?"

"శిశు సంరక్షణ భారం వహించే జనని!"

"ఆకాశంకన్నా సమున్నతుడెవడు?"

"జనకుడు."

"గాలికన్నా త్వరగా పరిగెత్తేది?"

"మనస్సు"

"నిద్రించినా కన్ను మూయనిది?"

"మీను"

"జన్మించినా చైతన్యం లేనిది?"

"గుడ్డు"

"రూపమున్నా హృదయం లేనిది?"

"రాయి"

"వేగంవల్ల జీవించేది?"

"ఏరు."

పిమ్మట యక్షుడొక నిమిషం ఆగి మళ్ళీ ప్రశ్నించాడు.

"చివికి జీర్ణించిన తృణం కన్నా శిథిలమైనది?"

"చింతా వ్యాకులమైన హృదయం."

"మరణించిన జీవుని వెంటనంటి పోయే దెవరు?"

"ధర్మం"

"ప్రపంచంలో అత్యద్భుతమైన విషయమేది?"

"అనుక్షణము మానవులు యమునిలోకానికి ప్రయాణం అవుతూనే ఉన్నారు! అయినా మిగిలిన వారందరు మరి తామే కలకాలం జీవించాలని కాంక్షిస్తారు! ఇంతకన్నా మహాద్భుతమేది లేదు.!

ఒకటి విడిచివేసిన మనుష్యుడు మహైశ్వర్యవంతుడవుతున్నాడు! అది ఏది?"

"కోరిక"

"యథార్థమైన బ్రాహ్మణత్వ సిద్ధికి హేతువేది? జన్మమా? శాస్త్రాధ్యయనమా?"

"రెండూ కానేరవు! సత్ప్రవర్తనవల్లనే బ్రాహ్మణత్వం సిద్ధిస్తున్నది.!

"జీవన్మృతుడెవడు?" "బంధు భృత్యాదుల కన్నుగప్పి తానొకడే భోగాలనుభవించే క్షుద్రుడు!"

"గృహస్థునికి బంధువెవరు?"

"శీలవతియైన కళత్రం"

"బ్రాహ్మణునికి దేవత్వ సిద్ధికి కారణమేది?"

"వేద శాస్త్రాధ్యయనము"

"భూదేవుడు మానవుడుగా మారిపోవడానికి కారణం?"

"మృత్యుభయం!"

"అందరితోనూ ఆప్యాయంగా వర్తించాలంటే విడిచిపెట్టవలసిన వేవి?

"గర్వాహంకారాలు"

"ఈ లోకానికి దిక్కెవ్వరు?"

"సత్పురుషులు!"

"నిజమైన పురుషుడెవడు?"

"మహాకీర్తిశాలి."

ఈవిధంగా అడిగిన ఇంకా ఎన్నెన్నో ప్రశ్నలకు ధర్మరాజు వెనువెంటనే సమాధానాలిచ్చేసరికి యక్షుడెంతో ఆనందించి అతనితో ఇలాగన్నాడు.

"రాజా! నీవిచ్చిన సదుత్తరాలు విని ఎంతో సంతోషించాను. ఈ నలుగురిలో ఎవరినో ఒకరిని మాత్రమే బ్రతికించగలను! వరం కోరుకో!"

ధర్మపుత్రుడు మృతులై పడియున్న ఆ నలుగురి వైపు ఎంతో ఆప్యాయంగా చూచాడు. కొంతసేపటివరకు అతనికి మరి ఏమనడానికీ పాలుపోలేదు! చిట్టచివరకి – "మహా సౌందర్యశాలి నకుల కుమారుని బ్రతికించుకోవాలని నా కోరిక!" అన్నాడు.

యక్షుడా సమాధానంతో ఎంతో ఆశ్చర్యపడి "భీమార్జునులు నీ కత్యంత ప్రేమపాత్రులుగదా! వారి నేల కోరలేదు!" అన్నాడు.

"మా తల్లి సంతానంలో నేనొకణ్ణి జీవించి ఉన్నానుగదా! "మరి మాద్రీదేవి సంతానంలో ఒకరైనా ఉండవద్దా? మహాత్మా! నీకు తెలియని ధర్మమేమున్నది?"

ఈ సమాధానం విని యక్షుడింకా ఆనందించి ఇలాగన్నాడు. "ధర్మరాజా! ఈ మాట అనగలిగిన ధర్మవేత్తవు నీ వొక్కడవే! నీ ధర్మనిష్ఠ నాకెంతో ఆనందం కలిగిస్తున్నది. నీ సోదరులందరు వెంటనే క్షుత్పిపాసారహితులై జీవిస్తారు! అదిగో చూడు!"

ఆ క్షణంలోనే మిగిలిన పాండవులందరు గాఢ నిద్రపోయి మేల్కొన్నట్లుగా లేచి నిలబడ్డారు!

ధర్మరాజానంద కల్లోలం మునిగి తేలుతూ ఇలాగన్నాడు:

"అయ్యా, నీవు యక్షమాత్రుడవు కానేకావు! సందేహంలేదు!"

"అవును! నేను యక్షుడను కానిమాట యథార్థమే! నీ ధర్మ పరీక్షార్థమై వచ్చిన ధర్మదేవతనే! తిరిగి నీ కింకొక వరం ప్రసాదిస్తున్నాను. నీ అభీష్టమేదైనాసరే! కోరుకో!"

దానిమీద ధర్మరాజు "పాపం! ఆ బ్రాహ్మణుని అరణి ఆ మృగం అపహరించుకుపోయింది. ఆ అరణికంటే మరి నాకు కోరదగిన దేదీలేదు." అన్నాడు.

ధర్మదేవత చల్లని వెలుగులా సరోవరంలోను ఆ పరిసరంలోను అమృతం వర్షం జల్లులుగా ప్రసరించాయి. అతడు ధర్మరాజు నీ విధంగా ఆశీర్వదించినాడు.

"నాయనా! నా అంశంలో అవతరించిన నీ ధర్మ నిరతికి దేవతలు పుష్ప వర్షం కురిపిస్తున్నారు! మృగ రూపంలో ఆ అరణి అపహరించి నిన్నింతగా క్లేశ పెట్టినదీ నేనే! ఇదిగో ఆ అరణి! తీసుకో! నీవు వరమేదీ కోరకపోయినా—అజ్ఞాతవాసంలో మీరే రూపాలు ధరించాలని కోరినా ఆవిధంగా మీ కారూపాలేర్పడేటట్లు వరం ఇస్తున్నాను! మీ అందరి ధర్మ నిరతికీ శుభం కలుగుగాక!"

అని వెంటనే అదృశ్యమై పోతూన్న ధర్మదేవత మీద, పాండవుల మీద పరిసర వృక్షాలు, లతలు రంగు రంగుల పూలవానలు జల్లులు కురిపించాయి! ★

# భంగపడిన రాగబంధం

అద్దెలకిచ్చే రెండో వాటాలోకి విజయలక్ష్మి వాళ్ళు కాపురానికొచ్చిన మొదటిరోజే మహాలక్ష్మమ్మగారు మనిషి అదోలా అయిపోయింది. ఎంతైనా ఇల్లుగలావిడ. అందులోను నిగర్వి అనడానికి వీలులేదు. తన ఇంటి ఆవరణలో తన రాజ్యమే ఏకచ్ఛత్రాధిపత్యంగా కొనసాగాలని అనుకొనే మనిషి. మరి ఇంతకాలమూ అలాగే సాగుతూ వచ్చింది. మొదటి వాటాలో కాపరం ఉంటూవున్న సరళా వాళ్లూ నిజంగా సౌమ్యులనే చెప్పాలి. మహాలక్ష్మమ్మగారికి ఏమాత్రం మనసు నొప్పకుండా సరిపెట్టుకుపోతున్నారు. వాళ్ళ వైఖరిచూచి ఆమెగారుకూడా పరవాలేదు, మన మెలా చెబితే అలా వుండేవాళ్లే అనుకొని నిశ్చింతగా ఉంటూవచ్చింది. ఇప్పుడు ఈ విజయలక్ష్మి వాళ్లూ వచ్చిందగ్గర్నుంచి ఆమెగారేదో సుఖావస్థలోనుంచి మేలుకొన్నట్లయింది.

విజయలక్ష్మి ఆ వాటాలోకి ప్రవేశించిన తడవుగా మహాలక్ష్మమ్మగారిని పిలిచింది. ఆమెగారు కూడా కొత్తగా వచ్చింది పిల్ల, ఏం చెబుతుందోననే ఆతుర్దాతో చకచకా వెళ్ళి 'ఏమిటమ్మాయి, పిలిచావా' అని అనునయంగా అడిగింది.

"అవును మామ్మగారూ, ఇదిగో ఈ గుమ్మానికెదురుగావున్న వెదురుగడల కట్టలను తీయించి ఆ మూల వేయించండి" అంది విజయలక్ష్మి.

"ఎందుకమ్మాయి" అని అడిగింది. ఇల్లుగలావిడ.

"ఎందుకంటారేమిటీ, ఇలా గుమ్మం ముందుంటే చూడడానికి బాగుండదు. ఇవి తీస్తే ఖాళీగావుండి మనుషులు తిరగడానికి వీసులుబాటుగా వుంటుంది."

"అమ్మాయి, వచ్చేది వేసవికాలం కదూ. పెరటి దొడ్లో పాక వేయించాలని తెప్పించాను. అప్పటినుంచీ ఇక్కడే పడి ఉన్నవి."

"అయితే ఆ దొడ్లోనే వేయించండి."

"బాగా చెప్పావు. ఏదో ఇంటి ముందైతే కంటికి కన్పిస్తాయని వేయించాను గాని దొడ్లో వేస్తే తెల్లవారేసరికి కనబడతాయా?"

"మామ్మగారూ, మీకలాంటి భయం ఏమాత్రం వుండనక్కరలేదు. మేమున్న ఇంట్లోకి దొంగలెవరూ రారు"

ఈ సమాధానంతో మహాలక్ష్మమ్మగారు నివ్వెరపోయి తాను ఆ వాటాను వాళ్లకు అద్దెకిచ్చిన పరిస్థితులను గుర్తుకు తెచ్చుకొంది.

విజయలక్ష్మి భర్త రామారావు నిన్న ఉదయమే గేటు దగ్గర నిలబడి అద్దెకేమైనా వాటా దొరుకుతుందా అని అడిగాడు. చూడగా మనిషెంతో మెత్తగా కన్పించాడు. నిజంగా అతను అలాంటివాడే. ఏదో కుదురుబాటుగా వేధించకుండా వుంటారనే నమ్మకంతో తాను ఈ వాటా అతనికి చూపించింది. అతనూ అద్దె బేరమాడకుండానే ఒప్పుకొని వెళ్ళాడు. ఇవాళే ఇంట్లో ప్రవేశించారు. ఇప్పుడాయనగారి భార్యామణి సంగతి చూస్తే ఇలా వుంది. ఐనా వెంటనే ఎలా వైరం పెట్టుకుంటుందీ; అందుకనే అన్నారు దిగితే కాని లోతు తెలీదని. ఆ అమ్మాయితో ఇంకా వాదం పెంచడం ఇష్టం లేక "సరేలే అమ్మాయి, రేపో ఎల్లుండో తీయిస్తాలే" అంది సమాధాన పూర్వకంగా.

విజయలక్ష్మి ఇక మాట్లాడలేదు. మహాలక్ష్మమ్మగారు ఇంట్లోకి వెళ్లుతూంది. ఇంతలో ఆ కొత్త వాటాలో గోడకి పెద్దగా మేకులు కొడుతూవున్న చప్పుడు వినిపించింది. తప్పకుండా విజయలక్ష్మిఆపని చేస్తూందని ఆమెగారు గ్రహించగలిగింది. ఎంతో డబ్బుపోసి కట్టించిన తన ఇంటి గోడల్ని అద్దెలకున్న వాళ్లు అలా మేకులుకొట్టి పాడుచేయడమంటే ఆమె అసలు సహించలేదు. ఆ విషయం సరళా వాళ్ళు వొచ్చిన రోజే కచ్చితంగా చెప్పేసి ఆంక్ష విధించింది. పాపం వాళు అలాగే సరిపెట్టుకుపోతున్నారు. ఆ రివాజే చెల్లాలని మహాలక్ష్మమ్మగారి ఆకాంక్ష. కాని ఇప్పుడు మళ్ళీ ఇలా జరగడంతో ఆమెకు చుర్రున కోపంవచ్చింది. తాను ముందుగా ఈ సంగతి వీళ్ళకు చెప్పకపోతినే అని నాలుక కరుచుకుంది. అయినా ఇప్పుడైనా నిక్కచ్చిగా చెప్పాల్సిందే అనుకొని వెనక్కి తిరిగి విసురుగా గుమ్మం దగ్గిరకెళ్లి "చూడమ్మాయి, అలాగోడలకు అంతేసి మేకులుకొడితే అవి ఉంటేనా పాడైపోవూ?" అంది మెల్లగా.

కుర్చీపీట ఎక్కి మేకులూ, గుండ్రాయీ చేత్తో పట్టుకొని వున్న విజయలక్ష్మి ఆమెగారి మాటలు వింటూ పీటపైనా దిగకుండా "మరి పటాలు తగిలించుకోవడానికి ఈ ఇంట్లో ఏమీ లేవాయె. మీరు పెట్టించకపోతే మేమైనా వీటి సంగతి పట్టించుకోవద్దూ" అంది విసుగ్గా.

"అయితే మీ పటాలకోసం మా గోడలు పగలగొడ్తారా" అంది ఆవిడ దూకుడుగా.

"మరి ఈ పటాలు ఏంచేసుకోమన్నారు"

"ఏమైనా చేసుకోండి. గోడలు పాడుచెయ్యడానికి వీల్లేదు."

"చూడండీ మామ్మగారు, ఇల్లు లేకపోతే కాపురమైనా మానుకొంటాంగాని ఈ పటాలు పెట్టెపూజకు అప్పగించలేము. ఒక్కొక్కటి ఎంత ఖరీదు పెట్టికొన్నామో తెలుసా?"

"ఎంతైనా కానివ్వండి మాకేం?"

"అలా ఐతే ఇవాళే ఖాళీచేస్తాం లెండి".

ఈ మాటతో మహాలక్ష్మమ్మగారు కొంచెం బేజారైంది. ఎంత తెగింపు! ఎంత చేవ! వచ్చి ఒకపూటకూడా కాలేదు. అప్పుడే తగాదా పెట్టింది. అదేమంటే ఖాళీచేసి వెడతామంటూవుంది. అప మూడు నెల్లనుంచి తగినవాళ్లు రాక ఆ వాటా అద్దె రాకుండా పోతూవుంది. ఎవరో వచ్చారు అంతే చాలనుకుంటే వ్యవహారం ఇలావుంది. ఏమి మాట్లాడడానికీ ఆమెకు పాలుపోలేదు. చివరకు "సరేనమ్మా, నువ్వు అలాఅంటే ఇక నేనేం చెప్పేది" అని దీర్ఘంగా నిట్టూర్పు విడిచింది. విజయలక్ష్మి గుండ్రాయిని నాపరాళ్ళపై ఖంగున కొట్టుకునేటట్టుగా విసిరేసి దగ్గరగా వచ్చి "చూడండీ, అంతగా మీ గోడలు పాడైపోతే వెళ్లేప్పుడు బాగు చేయించి వెళ్తాములెండి అంది ధీమాగా.

మహాలక్ష్మమ్మగారికి యీ అమ్మాయి సంగతి చూడబోతే అసాధారణంగా కన్పిస్తూవుంది. ఇల్లు బాగుచేయించి వెడతామన్న అద్దెవాళ్లను తాను ఇంతవరకూ యెరుగదు. అసలు వచ్చీ రావడంతోనే యిలా తానెన్నడూ ఘర్షణ పడలేదు. కాకపోతే వాళ్లేమైనా అడిగితే సర్ది చెప్పేది. కాని యీవిడ కొరకరాని కొయ్యగా వుంది.

డి. రామలింగం



# భంగపడిన రాగబంధం



అయితే ఆవాటా అలా పాడుబడి ఉండకుండా దీపం పెట్టే దిక్కు వరయినావుండాలంటే ఆ అమ్మాయితో ఆట్టే ప్రతిదానికీ జగడం పెట్టుకోవడం మంచిది కాదనుకొని ఆమెగారు ఇంట్లోకివెళ్లిపోయింది. ఇదంతా తన వాకిట్లో నిలబడి చూస్తున్న సరళకు వింతగానూ, వినోదంగానూ అనిపించింది. ఆమాత్రంధైర్యం తనకులేనందుకుతననుతానే నిందించుకొంది. చూద్దాం ఇక వ్యవహారం ఎలా నడుస్తుందోనని ఆమెకూడా కొంత ఉత్సాహపడింది.

ఇంట్లో ఎక్కడేవి వుండాలో అన్నీ అమర్చుకొన్న తరువాత భోజనాలు పూర్తి చేసుకొని విజయలక్ష్మి మధ్యాహ్నం వేళ సరళ ఇంటి గుమ్మంముందు కొచ్చి పిలిచింది. సరళ బైటికొచ్చి ఆమెను లోపలి కాహ్వానించింది. విజయలక్ష్మి వంటగదీ, ఆ పక్క వున్న గదీ అంతా కలయజూస్తూ ఇంటి అమరికను మెచ్చుకున్నట్లుగా సంతోషించి కుర్చీలో కూర్చుంది. సరళ కూడా మరో కుర్చీలో కూర్చుంది. పరవాలేదు. సరళ కాపరం బాగానేవున్నది. ఆమె భర్త ప్రకాశరావుకు కలెక్టరాఫీసులో ఉద్యోగం. వాళ్లకిద్దరు మగపిల్లలూ, ఒక ఆడపిల్లా. సరళ వైఖరిని పట్టిచూస్తే ఇద్దరిదీఆదర్శదాంపత్యమని తెలుస్తూనేవుంది. తనకు పిల్లలు లేకపోయినా వీళ్లపిల్లలవల్ల కొంత కాలక్షేపంగా వుంటుందనీ, ఇల్లుగలావిడ ఎలా వున్నా వీళ్ల పొరుగు బాగా వున్నదనీ విజయలక్ష్మి భావించింది. తన సంగతీ చెప్పుకొంది. ఆమెభర్త రామారావు హెల్తు ఇన్స్పెక్టరు. ఎప్పుడూ టూర్లలోనే ఉంటాడు. ఇలా ముచ్చట్లు ముగిసిన తరువాత విజయలక్ష్మి పాప నెత్తుకొని వెళ్లిపోతూవుంటే మహాలక్ష్మమ్మగారు తనవాకిట్లో నిలబడి ఓరగా చూస్తూ వీళ్ళకింత తొందరగా నేస్తం కలిసినందుకు చురచురలాడింది.

విజయలక్ష్మి ఆ ఆవరణలోకి కొనిరానికి వొచ్చిన తరువాత అక్కడ నెలకొవున్న 'శాంతిభద్రత'లకు భంగంకలిగింది. పరిస్థితి తీవ్రంగా మారిపోతున్నట్లు మహాలక్ష్మమ్మగారు చూస్తూనేవుంది. రెండు రోజులు గడిచాయి. తాను అన్నమాటప్రకారం పెరుగుగడ్డల కట్టలను తీయించలేదు. మూడో రోజు విజయలక్ష్మి వాటినితీయించి గేటు దగ్గిర గోడపక్కన వేయించింది. ఆ స్థలాన్నంతా సరళపిల్లలసహాయంతో తవ్వి పూలమొక్కలు వేసింది. పిల్లలు చాలా ఉత్సాహంగా మొక్కలకు నీళ్లుపోస్తూ సంబరపడ్డారు. సాయంత్రం భర్త ఇంటికివచ్చిన తరువాత ఆయనతో క్రోటన్స్ కుండీలు తెప్పించి చక్కగా ఇంటిముందుఅమర్చింది. రెండు కుండీలు సరళావాళ్ళకు పంపి, ఆవరణలోవున్న పంపుదగ్గర చేతులు కడుక్కొని లోపలి కెళ్ళింది. ఇదంతా మహాలక్ష్మమ్మగారు చూస్తూ వూరుకున్నదే గాని ఏమీ అనలేక పోయింది. ఏమంటుంది? ఇంటిని బాగుచేసుకుంటూన్న ఇల్లాలాయె మరి!

క్రమంగా ఆ ఆవరణ వాతావరణం మారుతూవుంది. పూర్వం నిశ్శబ్దంగా వుండేది. ఇప్పుడు పగలంతా కోలాహలమే. విజయలక్ష్మి రాక పూర్వం ఆ ఇంటి గేటు దాటి లోపలి కెవరూ వచ్చేవారు కారు. కూరగాయ లమ్ముకునే మనుషులు కూడా బైటినుంచే కేక పెట్టేవారు. గేటు ఎప్పుడూ దగ్గరకు వేసి ఉండేటట్లుగా మహాలక్ష్మమ్మగారు శ్రద్ధవహించేది. బారగా తీసివుంటే ఆమె వూరుకునేది కాదు. కాని ఇప్పుడది ఎప్పుడూ తీసేవుంటున్నది. ఇక పదిదాటి ఆఫీసుల కెళ్లేవారు వెళ్ళిపోయిన తరువాత విజయలక్ష్మి ఇల్లు ఒక చిన్న మహిళల క్లబ్బుగా మారేది. ఆవిడ ఇదివరకు కాపరం వున్న పేటనుంచి ఒక అరడజను మంది యువతులువచ్చేవారు కబుర్లతో, నవ్వులతో ఇల్లంతా మారుమ్రోగేది. అంతా కలిసి పచ్చీసో, కేరంబోర్డో, ఇవేవి నచ్చకపోతే చీట్లపేకలో బాహాటంగా ఆడుకొనే [illegible]. ఒకోరోజు కుట్లుసూదులూ అవి తెచ్చుకొని, ఆవరణలోవున్న ద్రాక్షపందిరికింద చాపలు పరిచి, అక్కడ సభదీర్చి, నానా విధాలైన అల్లికలు తీస్తూ వుండేవారు. వీరంతా ఇలా నిమగ్నమైవుంటే ఆ వచ్చిన వాళ్ళ తాలూకు పిల్లలు—ఆడపిల్ల లేమో పూలచెట్లచుట్టూ తిరుగుతూ వుంటే, మగపిల్లలు రాళ్లుపుచ్చుకొని జామచెట్టుకింద మంత్రాలు చదువుతూ వుండేవారు. ఎవరూ చూడకుండా ఒకటీ అరా రాయి పైకి కొట్టేవాళ్లు. వీళ్ళందరి రాకతో ఆ ఆవరణలో వుండే

వస్తువులు స్థానభ్రష్టత్వం పొందుతూ ఉండేవి. మహాలక్ష్మమ్మగారు ఇవన్నీ ఒక కంట కనిపెడుతూనే వుండేది. సమయం చూచి వారిస్తూనూవుండేది. ఆమె వారించడమూ, వాళ్లు వినడమూ, మళ్ళీ యథాప్రకార సిద్ధిరస్తు పరిపాటి అయిపొయ్యాయి. ఇలా పగలు నాలుగు గంటలదాకా వాళ్ళంతా వనభోజనాలకు వచ్చినవాళ్ళకు మల్లే విశాలమైన ఆ ఆవరణలో ఖులాసాగా గడిపి పొయ్యేవాళ్ళు. అప్పటికి కొంత తెరపిచ్చినట్లుగా వుండేది. అంతదాకా కనిపెట్టుకు చూసుకొని మహాలక్ష్మమ్మగారు ఇంట్లోకి వెళ్ళేది.

విజయలక్ష్మి వొచ్చిన తరువాత సరళ వైఖరిలో చాలా మార్పు వచ్చింది. ఇది వరకు సౌమ్యంగా, మట్టుగా వుండేది. ఇప్పుడు ఆవిడ కూడా చురుగ్గా, నిర్లక్ష్యంగా వ్యవహరిస్తూవుంది. ఇల్లుగలావిడకు కొంత కటువుగా సమాధానం కూడా చెప్పగలుగుతూవుంది. ఇదివరకు పెట్టెలో భద్రంగావుండే చీరెలు బైటికొస్తున్నాయి. చక్కగా ముస్తాబై, విజయలక్ష్మితో కలిసి బజారుకు వెళ్ళి, కొత్తరకాల చీరెలు, స్టెయిన్ లెస్ స్టీల్ పాత్రలూ, అల్లకం సామగ్రీ, అలంకరణ వస్తువులూ కొనుక్కొచ్చుకుంటూ వుంది. ఈ బేరసారాలలో విజయలక్ష్మి బాగా ఆరితేరింది. షావుకారును తను గీచిన గీటుకు రప్పించి ఆ ధరకే ఇచ్చేటట్టు చేయగల నేర్పు ఆమెకుంది. ఈమె వెంట వెళ్ళి కనుక్కోవడంచేత సరళకు బేరం రాయితీగా అనిపించేది. బజారునుంచి తెచ్చినవి భర్తకు చూపుకొని మురిసిపొయ్యేది. విజయలక్ష్మి తెలివితేటల్ని అతనూ మెచ్చుకునేవాడు. ఈ ఆడవాళ్ళ మూలకంగా క్రమంగా రామారావు, ప్రకాశరావు సన్నిహితమిత్రులయ్యారు. సెలవు రోజుల్లో ఇద్దరూ కబుర్లతో కాలక్షేపం చేస్తూండేవాళ్లు. రామారావుకుండే సాహిత్యం గొడవ ప్రకాశరావుకు కూడా పట్టింది. అటు విజయలక్ష్మి సరళా తరచు మేటినీ సినిమాలకు, పార్కులకూ వెళ్తూండేవారు. విజయలక్ష్మి సరళను కాఫీ హౌస్‌కు కూడా తీసుకెళ్ళి ఫేమిలీ రూంలో కూర్చోబెట్టి టోస్ట్ కాఫీ ఇప్పించేది. ఇద్దరూ ఇంటికొచ్చి ఒకరింట్లోనే వంటచేసి రెండుకుటుంబాలవాళ్లూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేసేవారు. ప్రకాశరావు టూరు వెళ్ళినరోజున విజయలక్ష్మి సరళ ఇంట్లోనే గడిపేది. సరళ పాప పుట్టినరోజు పండుగను విజయలక్ష్మి ఘనంగా జరిపింది. విజయలక్ష్మి మిత్రురాళ్ళంతా రకరకాల ప్రెజెంట్సు తెచ్చారు. ఈ గౌరవానికి సరళకూడా ఉప్పొంగిపోయింది. కుటుంబాలు వేరుకాని మనుషులు ఒకరికొకరు చాలా ఆప్తులయ్యారు.

వీళ్ల స్నేహంచూచి మహాలక్ష్మమ్మగారు తన వ్యక్తిత్వం బలహీనమైపోతున్నట్లుగా భావించింది. ఆ రెండు కుటుంబాలు ఎవరి దారిని వారుంటే తన పెత్తనానికి ఆ ఆవరణలో ఎదురుండేదికాదు. కాని ఇప్పుడు ఏమీ అనలేకుండా వుంది. పైగా విజయలక్ష్మి రాకతో సరళ అలా తయారుకావడం ఆమెకు కొంచెం కంటకంగానే వుంది. ఇప్పుడు సరళ తనతో ఆట్టే మాట్లాడదు. ఏదైనా అడిగితే వెనుకటంత వినయంగా, శ్రద్ధగా సమాధానం చెప్పడంలేదు. మనిషి కొంచెం తెలివితేటలతో ప్రవర్తిస్తూవుంది. ఏమైనా వాళ్లిద్దరి అన్యోన్యం మహాలక్ష్మమ్మగారికి సరిపడదు. ఈ సమస్యను ఆమె అనుక్షణమూ ఆలోచిస్తూనే వుంది.

ఆరు నెలలు గడిచాయి. విజయలక్ష్మి, సరళల కుటుంబాలు ఎంతగా సన్నిహితం కావాలో అంతా అయ్యాయి. మహాలక్ష్మమ్మగారి కెంత అక్కసుపుట్టాలో అంతా పుట్టింది. కాని అదంతా లోపలే వుందిగాని క్రియారూపేణా బైటపడలేదు.

ఇలావుండగా సరళతల్లికి సుస్తీగావుందని కబురొస్తే ఆవిడ పిల్లల్ని తీసుకొని పుట్టింటికి ప్రయాణమై వెళ్ళింది. ప్రకాశరావు ఏకాకి అయ్యాడు. ఆడవాళ్లుంటేనే ఇరుగు పొరుగుతో స్నేహం, రాకపోకలూ సాగుతూ ఉంటాయిగాని మగవాడొక్కడైతే ఏముంటుంది? సత్రం భోజనం, మఠం నిద్రేగా! ప్రకాశరావు ఇప్పుడు హోటల్లో భోజనంచేస్తూ ఆఫీసు కెళుతూ వున్నాడు. ఆదివారాలు తను ఇంట్లోనే భోజనం చేయవలసిందని విజయలక్ష్మి ఆమె భర్తా పట్టుపడితే అతనికి తప్పేదికాదు. నిజంగా ఆరోజు అతని కెంతో సంతోషంగా గడిచేది. ఇంట్లో ఏదైనా పిండివంట చేస్తే ప్రకాశరావు ఆఫీసునుంచి వొచ్చిన తర్వాత విజయలక్ష్మి స్వయంగా ప్లేటులో పెట్టుకొని అతని గదిలోకెళ్లి "ఇవి తీసుకోండీ" అనేది. ఆమె అంత శ్రద్ధతో తీసుకొచ్చిస్తే వద్దనడం బాగావుండదని, అంతకు కొంచెం ముందే హోటలుకెళ్ళి వచ్చినవాడైనా, మళ్లీ అవికూడా ఓపికగా పుచ్చుకొనేవాడు. తరువాత ఓ వెండిగ్లాసుతో కాఫీకూడా తీసుకొచ్చి ఇచ్చివెళ్ళేది. అతను డ్రస్సు మార్చుకొని బజారుకేసి వెళుతూ "ఏమైనా ఉత్తరాలొచ్చాయండీ" అని ఆమెను వాకబు చేసేవాడు. వొస్తే తీసి ఇచ్చేది. భర్త టూరుకెళ్లినరోజూ ఇంటిలో అవసరముగా ఏదైనా కావలసివొస్తే విజయలక్ష్మి మొహమాట పడకుండా ప్రకాశరావుతో తెప్పించుకునేది. పోస్టాఫీసునుండి కవర్లూ, కార్డులూ తెమ్మంటే అతను తెచ్చిపెట్టేవాడు. ప్రకాశరావు కొచ్చే పత్రికలనూ, పుస్తకాలనూ ఆవిడ అడిగి తీసుకెళ్లి చదువుకొని ఇచ్చివేస్తూవుండేది. ఆసినిమా బాగున్నదనీ, ఈ సినిమా బాగాలేదనీ ఆవిడ కచ్చితంగా చెప్పేస్తూవుంటే అతను చిరునవ్వుతో వింటూండేవాడు. తనఅభిప్రాయాలు అంత కచ్చితంగా చెప్పేవాడుకాదు. అతను ఓ సినిమా బాగుందని అన్నాడంటే అది అతని



వింధ్యప్రదేశ్ గవర్నరు శ్రీ మొసలికంటి తిరుమలరావు గారు. వీరు ఈ నెల 16-వ తేదీన ప్రమాణస్వీకారం చేశారు.

## ప్రసిద్ధ బెంగాలీ నవల

# "పథేర్ పాంచాలీ"

## తెలుగు అనువాదం ప్రచురణ

# వచ్చేనెల ప్రారంభం

విభూతిభూషణ వంద్యోపాధ్యాయ రచించిన బెంగాలీ నవల "పథేర్ పాంచాలీ" అనువాదం ఆంధ్ర వారపత్రికలో సీరియల్ గా వచ్చేనెల నుండీ ప్రచురిస్తున్నాము.

## ప్రచురణ తేదీ కోసం నిరీక్షించండి

## ★ భంగపడిన రాగబంధం ★

విలువల ప్రకారం వుండాలి. తెలుగు సినిమాలలో చాలాభాగం చెత్త అని అతని అభిప్రాయం. కాని సాధారణంగా తెలుగు మాత్రమే వచ్చిన ఆడవాళ్ల వైఖరి అందుకు భిన్నంగా వుంటుంది. వాళ్లకు వినోదానికి తరచు ఒక కొత్తసినిమా వుండాలి. ఇలాంటి విషయాలు చర్చకు వచ్చినప్పుడు ప్రకాశరావు చెప్పే ప్రమాణాలను విజయలక్ష్మి తెల్లబోయి వింటూవుండేది. వాటిలో కొన్నిటి నైనా ఖండిస్తూ తానూ కొంత వాదించాలనుకునేది. కాని చివరకు చెప్పలేకపోయేది. ఏదో స్త్రీ సహజమైన బలహీనత ఆమెను వారించేది. అతను ఒకపర్యాయం ఏదో ఇంగ్లీషుసినిమా చూడండని ఆవిడకు సలహా ఇచ్చాడు. దాన్ని అర్థం చేసుకోడానికి భాష బాగా తెలీక పోయినా పరవాలేదని




చెప్పాడు. ఆవిడ తన స్నేహితురాలొకామెను తీసుకొని ఆ సినిమాకే వెళ్లింది. మరుసటిరోజు వాళ్లిద్దరూ కలిసి ప్రకాశరావుతో దీర్ఘంగా వాదించారు. ఆ సినిమాలో ఎక్కువ పాత్రలు లేవు. కథలో వాళ్లిద్దరూ చివరకు భార్యా భర్తలు కూడా కారు. ఆవిడ వివాహిత స్త్రీ. అతను తాడూ బొంగరం లేకుండా తిరిగే యువకుడు. వాళ్ళిద్దరిదీ ప్రేమ అనలేము కాని ఏదో బాంధవ్యం. చివరకి ఫలితం ఆవిడ వివాహ వ్యవస్థకు దూరంగా పోయింది. సమాజమంతా ఆమెను పతనం చెందిన స్త్రీ అంటున్నా ఆవిడ మాత్రం ఏదో ఆనంద లోకంలో విహరిస్తూన్నట్టుగా వుంటుంది. ఇందులో చెప్పకోదగిన గొప్పేమిటని విజయలక్ష్మి ప్రశ్న. ఏమీ లేదు. కాని వైవాహిక సమస్య వ్యక్తీకరించబడిందని అతని సమాధానం. అతను చెప్పేది తాను ఒప్పుకోలేక పోయినా అతనితో మాట్లాడుతూ వుంటే ఏదో చైతన్యం పొందుతున్నట్లుగా విజయలక్ష్మి అనుభూతి చెందేది. ఆవిడ వేసే ప్రశ్నలన్నిటికీ అతనూ సమాధానాలు చెబుతూండేవాడు.

ఒకరోజు విజయలక్ష్మి, ఆమె భర్తా ప్రకాశరావు కలిసి "నయాగరా" సెకండ్ షోకి వెళ్లారు. ఆవిడ తెల్లని వాయిల్ చీరపై చిక్కని ఆకుపచ్చ రంగు స్వెటర్ తొడుక్కొని, రెండు జేబుల్లో చేతులు పెట్టుకొని, శాండల్స్ వేసుకొని వాళ్ళిద్దరి మధ్యా నడుస్తూ మాట్లాడుతూ వస్తూవుంటే మహాలక్ష్మమ్మగారు చూచి ముక్కు మీద చెయ్యి వేసుకొని "ఏమిటీ విడ్డూరం! ఆవిడ పోకడలు పోతే, భర్తగదా అతనికైనా వుండొద్దూ" అని అనుకునేది లోపల.

మరుసటిరోజు ఉదయమే రామారావు టూరు వెళ్ళాడు. ప్రకాశరావు ఆఫీసుకు వెళ్ళలేదు. అతను మధ్యాహ్నం పూట పడకకుర్చీలో కూర్చొని అమెరికానుంచి తన కొచ్చిన పత్రికలు తిరగేస్తున్నాడు. పక్క గది తలుపు తీసేవుంది. అటునుంచి ఎవరో వస్తున్న అలికిడి అయింది. అటు తిరిగి చూచాడు. విజయలక్ష్మి! "లోపలి కొస్తూనే "ఆఫీసుకు వెళ్లి లేదా?" అంది.

"లేదండీ"

"ఏం"

"బడలికగా వుంది"

(55-వ పేజీ చూడుడు)

డిటెక్టివ్ సీరియల్

# అపూర్వ హంతకులు

మూలం: ఎడ్గార్ వాలెస్ అనువాదం: 'వినాయక'

## 6

### ఆచోకీ

ఎర్రఎర్రని అక్షరాలతో పెద్ద పెద్ద ప్రకటనలు! బ్రహ్మాండమైన శీర్షికలు! గొంతు చించుకుని కేకలు వేసే కుర్రాళ్ళు! లండన్ వీథుల్లో ఆమూర్నా డెక్కడ చూచినా అపూర్వ హంతకుల దురంతాలను గురించిన వార్తలే! పేపర్లన్నిటిలోను ఒక్కటే ఘోష! అపూర్వ హంతకులలో ఒకతిన్ని అరెస్టు చేసేదాకా వచ్చిందనీ, అయితే చూపువాసిలో అదంతా తప్పిపోయిందనీ పేపర్లన్నీ మోతెత్తిపోయాయి! రైళ్ళల్లో ప్రయాణీకులంతా కనురెప్పలు వెయ్యకుండా పేపర్లు చదువుతూ 'మేమే ఆ 'బాకా' ఎడిటరుపరిస్థితిలో ఉంటేనా-' అని ఏవేవో కంగారుగా మాట్లాడుకున్నారు! జనం కొటకొాలు, యుద్ధాలు, హత్యలు మొదలైన సామాన్య విషయాలను గురించి మాటాడుకోవడం మానేసి, అదే పనిగా ఆ అపూర్వ హంతకులను గురించే చర్చించుకున్నారు. ఆ హంతకులు' తమ మాటప్రకారం ఆ విదేశమంత్రిని రేపే చంపివేస్తారా? ఎక్కడవిన్నా అదే ప్రశ్న!

ఇక ఎవరికీ మరి వేరే గొడవే లేదు! నెలరోజులనించీ ఆ హంతకులు హత్య చేసి తీరతామని బెదిరిస్తున్నారు! అమాంతంగా ఏదైనా విడ్డూరం జరిగితే తప్ప—తెల్లవారే సరికి ఈ హత్య జరిగే తీరుతుంది!

లండన్ పేపర్లపరిస్థితుల్లో 'బాకా' కార్యాలయానికి థేరీ రాకపోకలను గురించిన వార్తలే విడ్డూరంగా ప్రకటించడంలో ఆశ్చర్యమేమీ లేదు!

దీనిని గురించి టెలిగ్రాం పత్రిక ఈ విధంగా వెక్కిరించింది: "చచ్చు చవకబారు అర్ధణా పేపరులో పనిజేసే పత్రికా రచయితలు ... దరు - దేశానికంతటికీ ప్రముఖ వ్యక్తిని చంపివేస్తామని బెదిరించిన హంతకుల్లో ఒకతణ్ని - ఇలాగ చల్లగా జారవిడిచి వెయ్యడంలో అంతరార్థమేమిటో మాకు బోధపడడం లేదు!.. ఇందుచేత ఇలాంటి పత్రికాపతివ్రతా మతల్లుల నోట వెలువడేవన్నీ నమ్మవచ్చునా? ఇంతా చేస్తే ఈ అద్భుత వ్యక్తి ఈ కార్యాలయానికి విచ్చేసి ఉంటాడా? అని మా అనుమానం!"

ఆవేళ ఒంటిగంటకే స్కాట్లండ్ యార్డ్ అర్జెంటుగా ఒక ప్రకటన జారీచేసి, నిమిష నిమిషానికీ రేడియోలో ఆ ప్రకటన ప్రసారం చేయించింది!

### "వెయ్యి పౌనుల బహుమతి!"

"థేరీ అనే వ్యక్తి అపూర్వ హంతకుల ముఠాలో వాడేనని గట్టి అనుమానం ఉంది. అతగాణ్ణి వెంటనే పట్టుకోవాలి! అతడు స్పెయిన్ దేశస్థుడు. ఇంగ్లీషురాదు. 5 అడుగుల ఎనిమిదంగుళాల ఎత్తు. గోధుమరంగు కళ్లు. నల్లని జుట్టు. అంతకన్నా కొంచెం లేతరంగు మీసాలు. పెద్ద మొహం. మొహం మీద మచ్చలు. ఒక చెంపమీద తెల్లటి మచ్చ. శరీరంమీద కత్తిగాయం. మంచి బలంగా కుదిమట్టంగా ఉంటాడు.

ఈ ఆనవాళ్లు కలిగిన థేరీ అనే ఆసామీని పట్టుకోడానికి ఆచోకీ తెలియజేసిన వ్యక్తికిగాని, వ్యక్తులకుగాని పైన ఉదాహరించిన వెయ్యి పౌనులు బహుమతీ ఇస్తున్నాం."

'బాకా' సంపాదకుడు, సహాయ సంపాద

### జరిగిన కథ:-

స్పెయిన్ దేశంలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవం జరుగుతున్న రోజుల్లో విప్లవకారులు ఇంగ్లండులో మకాంవేశారు. వాళ్ళని వెళ్ళగొట్టడంకోసం ఆంగ్లదేశమంత్రి పార్లమెంటులో ఒక చట్టం ప్రవేశపెట్టాలని అనుకున్నాడు.

'అపూర్వహంతకులు' ఆ చట్టం ప్రవేశపెడితే చంపివేస్తామని బెదిరిస్తూ ఉత్తరం రాశారు. 'బాకా'ఆ ఉత్తరం ప్రకటించడంతో ఊరూ వాడా గుప్పుమంది.

పార్లమెంటులో ఈ చట్టం ప్రవేశపెట్టే ముందు ఒకసభ్యునికి—పార్లమెంటు సభ్యులు చట్టం ఆమోదించకూడదని హెచ్చరిస్తూరాసిన బెదిరింపు ఉత్తరం అందింది.

తరవాత 'అపూర్వ హంతకులు' లిమిటెడ్ కంపెనీ పేర ఒక పెద్దభవనం అద్దెకు తీసుకుంటూరు. దానిలో మాన్ ఫ్రెడ్ గోన్సాలెజ్ లిద్దరు ఒక మారణపదార్థం తయారు చేస్తారు. పిమ్మట 'బాకా'లో ఒక దురంతం జరిగింది. సంపాదకునికి కూడా ఒక బెదరింపు ఉత్తరం అందింది. ఆ తరవాత థేరీ 'బాకా' కార్యాలయంలో ప్రత్యక్షమైనాడు! అతడు 'అపూర్వహంతకుల' గుట్టు బయటపెట్టేలోగా ఒక ముసుగుమనిషి రివాల్వరుతో అక్కడివారిని బెదిరించి, థేరీని విడిపించుకుపోతాడు.

# ★ అపూర్వ హంతకులు ★

వాడు అందించిన సమాచారంమీదనే ఈ ప్రకటన ఈ విధంగా వెలువడిందని ఊహించుకోవచ్చును. ఇంతేగాక స్పెయిన్‌కీ ఇంగ్లాండు దేశానికీ మధ్య ఉన్న తీగలు కూడా అహోరాత్రాలిందుకోసమే సిద్ధం చేసి పెట్టారు. మాడ్రిడ్ నగరంలోని ప్రముఖులను కూడా అర్ధరాత్రివేళ నిద్రలో లేపి థేరీని గురించి అక్కడ దస్త్రాలలో భద్రపరిచిన వివరాలన్నీ పట్టుకున్నారు. ఇంగ్లండులో పోలీస్ కమిషనర్‌కు తెలిసిన భోగట్టాని బట్టి అదీ ఇదీ కలయ బోశారు.

సర్ ఫిలిప్ రేమన్ పోర్ట్‌లాండ్ భవనంలో చదువుకొనే గదిలో సుఖాసీనుడై ఉన్నాడు. ఏదో ఉత్తరం రాస్తున్నాడు. కాని మనస్సు దానిమీద నిలబడడం లేదు.

అది అతని ఎస్టేటు మేనేజరు పేర రాస్తూన్న ఉత్తరం. ఇన్నాళ్ళనించీ ఆ ఎస్టేటు వ్యవహారాలన్నీ సర్ ఫిలిప్ రేమనే స్వయంగా చూసుకొంటూ ఉండేవాడు.

అతనికి పిల్ల, పాప, భార్య ఎవరు లేరు! అతడా ఉత్తరంలో ఒకవేళ వీళ్లు తాము చెప్పినదంతా చేసే పక్షంలో-నన్ను కని పెట్టుకుని ఉన్న వాళ్ళందరికీ కావలసిన ఏర్పాటులన్నీ చేస్తున్నాను" అని రాశాడు. దాన్నిబట్టి ఆ ఉత్తరం ధోరణి పసిగట్టవచ్చును!

మంత్రికి అహోరాత్రా లదేపనిగా పహరా ఏర్పాటుచేశారు. దీనితో అతని చిరాకు చిటచిటలాడింది! ఈ చిరాకులో సర్ ఫిలిప్ రేమన్ తన ప్రాణాపాయం సంగతికూడా మరిచిపోయాడు! ఇక అతనికి ఒకేఒక దృఢనిశ్చయం! ఎలాగయినా పార్లమెంటుచేత విదేశీయ బహిష్కారచట్టం ఆమోదింపజేసితీరాలి! 'అపూర్వ హంతకుల పన్నాగాలు సాగకుండా అటకట్టించి వెయ్యాలి! మంత్రివర్గం పేరుప్రతిష్ఠలు నిలబెట్టాలి.'

ఈ సందర్భంలో ఒక త్రైమాసిక పత్రికలో అతడొక వ్యాసంకూడా రాశాడు. అది ఆ తరవాత చాలాకాలానికి అచ్చువేశారు. 'వ్యక్తిత్వము—సాంఘిక బాధ్యత' అన్న శీర్షికతో రాసిన ఆ వ్యాసంలో మంత్రి ఇలా అన్నాడు.

"ఎవరో ఏదో విమర్శచేసి అడ్డుపడినంత మాత్రాన లక్షలాదిజనం యోగక్షేమాలు సంరక్షించవలసినవ్యక్తి తన విధ్యుక్తధర్మం విడిచిపెట్టడం కేవలం అన్యాయం! ప్రజలు తమ దేశీయాంతర్దేశీయ వ్యవహారాలు, సాంఘికాభ్యుదయమార్గాలు, కోరికలు ఇష్టానిష్టాలు మొదలైనవన్నీ సరిదిద్దాలనే కదా! పార్లమెంటుకు ఎన్నుకునేది! కనక మంత్రి ఎలాంటి ఆపత్తు లెదుర్కొన్నా లక్ష్యపెట్టక తన విధ్యుక్త ధర్మాలన్నీ నెరవేర్చి తీరాలి! ఈ పరిస్థితుల్లో మంత్రి తానొక మానవవ్యక్తి నన్నమాట కూడా మరిచిపోయి వట్టి యంత్రంలా వ్యవహరించాలి!"

సర్ ఫిలిప్ రేమన్‌కున్న స్నేహితులు చాలా తక్కువ. అతనికి నలుగురితోను కులాసాగా తిరిగే అలవాటు లేనే లేదు! మనిషి చాలా నిజాయితీపరుడు. ప్రతీదీ తూచి తూచి న్యాయంగా పోవాలన్న గట్టి పట్టుదలగల వ్యక్తి. ఈ విషయంలో మరి అతన్నెవరు కదిలించలేరు! ఇక ఏదైనా తలపెట్టాడంటే పచ్చిరక్తం తాగేదాకా నిద్రపోయే ఘటం గాదు! పాపం! జీవితంలో కొత్త 'ఆప్యాయత' అంటే ఏమిటో చవి చూడకపోవడంవల్ల అతడీవిధమైన యంత్ర మానవుడుగా తయారైనాడు! అతనికి ఆదర్శాలు, ఉత్సాహాలు మొదలైన పెద్ద పెద్ద లేనే లేవు! అతన్ని చూసినా లేవరికీ ఇటువంటి సమున్నత భావాలేవీ కలగనే కలగవు! ఎలాగో అలాగ ఈ చట్టం దేశక్షేమానికి చాలా అత్యవసరమనే నిశ్చయానికి వచ్చేశాడు. అంతే! అది వెంటనే పార్లమెంటులో ప్రవేశపెట్టేశాడు! మరి ఏమైనాసరే అది పార్లమెంటులో నెగ్గించి తీరాలని భల్లూకపుపట్టు పట్టాడు. మంత్రికి వట్టి లక్ష్యాలేతప్ప పెద్ద ఆశలు, ఆర్భాటాలు ఏవీ లేవు. మంత్రివర్గంలో ఉన్న వారందరిలోకీ ఇతడు చాలా అసాధ్యుడు! తనమాట తప్ప ఇంకొకరిమాట నెగ్గనియ్యడు! ఈ పంతంలో ఎక్కడా 'రాజీ' అన్నమాటకూడా వినబడ కూడదంటాడు!

ఈ భూప్రపంచంలో ఏదయినా ఒకవిషయంమీద ఒక అభిప్రాయానికి వచ్చివేస్తే వెంటనే మంత్రివర్గంలో వారంతా దానికి పక్కతాళం వేసితీరా లన్నమాటే!

నాలుగయిదు సారులు మంత్రివర్గంలోని ఒక మంత్రిపుంగవుడు రాజీనామా దాఖలు చేస్తాడనే పుకారులు కూడా బయలుదేరాయి. ఆ మంత్రి రాజీనామాకు విదేశ శాఖమంత్రి భల్లూకపుపట్టే కారణం! చిన్న విషయమైనా—పెద్ద విషయమైనా—మంత్రి చెప్పినదంతా అక్షరాలా జరిగి తీరవలసిందే!

ఇందువల్లనే మంత్రికేర్పరచిన ప్రత్యేక భవనంలో ఉండననీ మంత్రి కార్యాలయంలో మకాం చేస్తాననీ భీష్మించుకుని కూర్చున్నాడు. ఇందుచేత డౌనింగ్ స్ట్రీట్ 44-వ నెంబరు భవనంలోనే మంత్రికి మకాం సౌక

**కుట్ర**

రచయిత: బ్రదర్ ఈ పేపరువాళ్ళంతా నేను పైకి రాకుండా కట్టుకట్టి కుట్రచేస్తున్నారు తెలుసా?

మిత్రుడు: ఏం గిరాకీ?

రచయిత: ఒకటే నిదర్శనం. నేను ఒకటి రాసి, దాన్ని పది మందికి పంపాను. అందరూ తిరగ్గొట్టారంటే నమ్ము. ఇది కుట్ర కాక మరేవిటి?

ర్యాలన్నీ ఏర్పాటు చేశారు. అందులోనే ఆఫీసు!

ఇంతకు పూర్వం మంత్రి రోజూ తన పోర్ట్‌లాండ్ భవనంనించి డౌనింగ్ వీధికి రాకపోకలు సాగిస్తూండేవాడు!

రోజులు దగ్గిరపడుతున్నకొద్దీ పోలీసులు ఇక ఇప్పు డీలాగ జరగడానికి వీల్లేదనీ మంత్రి డౌనింగ్ వీధిలోనే మకాంవేసి తీరాలనీ పట్టుపట్టారు!

ఈ వీధి వీధి అంతా తనకు క్షుణ్ణంగా తెలుసుననీ ఇక్కడఉంటే మంత్రిని సంరక్షించడం చాలా తేలికనీ పోలీసుశాఖ నచ్చచెప్పింది.

అయితే దీనికి మంత్రి ఒక పట్టాన ఒప్పుకోలేదు! ప్రస్తుతం పైకి కనబడిపోతున్నంత బందోబస్తు, హంగామా డౌనింగ్ వీధిలో అంతగా ఉండదని హామీ ఇచ్చి నచ్చచెప్పిన తరవాతనే మంత్రి మకాం మార్పుదలకు కొంచెం అంగీకరించే ధోరణిలో పడ్డాడు.

సూపర్నెంట్ ఫాల్‌మాత్ సిర్మోహమాటంగా ఇలా చెప్పాడు:

"గడ్డం గీసుకుంటూంటే మఫ్టీ పోలీసులు పక్క పక్కన తిరగడం మీ కిష్టంలేదు! స్నానాల గదిలో కూడా ఈ పోలీసు బందోబస్తు ఏమిటని మీరొకసారి విసుక్కున్నారు. కూడాను? మరి డౌనింగ్ స్ట్రీట్‌లో ఈ బెడద లేవీ ఉండవు! అసలు మఫ్టీ పోలీసులెవరూ మీ కంట పడనే పడరు!"

దీనితో ఈ సమస్య పరిష్కారమైపోయింది.

తన స్వంత భవంతి విడిచిపెట్టేసి డౌనింగ్ స్ట్రీట్ భవనానికి వెళ్ళేముందే మంత్రి తన ఎస్టేటు ఏజెంటు పేర ఆ ఎస్టేటు వ్యవహారాల విషయమై ఉత్తరం రాస్తున్నాడు. అది రాస్తూన్నంతసేపు డిటెక్టివ్ వీధిలోనే నిలబడిఉన్నాడు.

ఇంతలో మంత్రిపక్కన టెలిఫోను గణగణ మోగింది. ఇలాంటి గోలలంటే మంత్రికి మహా రోత! అయినా వినక తప్పలేదు! ఆ మాట్లాడేది ప్రధాన కార్యదర్శి. అత నిలా అన్నాడు.

"మీకోసం ఇక్కడ క్షణక్షణం ఎదురు చూస్తున్నాం. 44 డౌనింగ్ స్ట్రీట్‌లో ప్రత్యేకంగా 60 మంది పోలీసు సిబ్బంది రెడీగా ఉన్నారు. ఈ వేళ, రేపూ, ఇంకా కొన్ని గట్టి కట్టుదిట్టాలు చెయ్యాలని చూస్తున్నాం—"

అని ఆ ప్రధాన కార్యదర్శి ఇంకా ఏమేమో చెప్పబోయాడు. ఆ కార్యదర్శి వయస్సులో చాలా చిన్న. ఈ విషయంలో చాలా ఇదిగా పని చేస్తున్నాడు! కాని మంత్రి కిది వింటూంటే చిరాకు తలకెక్కింది:

"నన్నొక ఇనప్పెట్టిలో పెట్టి తాళం వేస్తే ఇంతికన్న మహా బాగుంటుంది!" అని వెటకారంగా సమాధానం చెప్పి, అంతటితో ఆ సంభాషణ తుంచేశాడు.

ఇంతలో ఎవరో తలుపుతట్టారు. తలుపు సందులో సూపర్నెంటు ఫాల్‌మాత్ ప్రత్యక్షమై "మిమ్మల్నింత తొందర చెయ్యడం నా కిష్టం లేదు. కాని—" అన్నాడు. విదేశమంత్రి మరి గత్యంతరం లేక రుసరుసలాడుతూ వెంటనే బగ్గీలో 44 డౌనింగ్ స్ట్రీట్‌కు వెళ్ళిపోయాడు.

ఈ విధంగా రైల్లో ఆదరాబాదరాగా సామాను పడేసినట్టుగా—ఇంకో చోటికి బస మార్చడం అంటే మంత్రికి చాలా చిరాకు వేసింది! ఆపైన తన కిరువైపులా మోటారుసైకిళ్ళు! వాటిమీద మఫ్టీపోలీసులు! తీరా డౌనింగ్ స్ట్రీట్‌లోనికి వచ్చేసరికి ఈ బగ్గీతప్ప ఇంకో టేదీ లోపలికి వెళ్ళడానికి వీల్లేనంత యమ బందోబస్తు! కొంతమంది చుట్టూరాజేరి మంత్రిని చూడగానే 'ఓ' అని హర్షధ్వానాలు చేశారు! మంత్రికి జన్మలో ఎన్నడూ ఎరగనంతటి తలవొంపు జరిగినట్టనిపించింది.

లోపలికి వెళ్ళేసరికి కార్యదర్శి సిద్ధంగా ఉన్నాడు! విదేశీయ బహిష్కరణ శాసనం రెండోసారి ప్రవేశపెట్టేముందు మంత్రి ఇచ్చే ఉపన్యాసం చిత్తుకాపీ అతనిముందుంచి ఇలాగన్నాడు: "దీనికి చాలా ఆటంకాలొచ్చేటట్లున్నాయి. అయితే 36 గురుదాకా మెజారిటీ ఉన్నారు. మొత్తంమీద చట్టం తేలికగానే పాసయిపోతుంది!"

సర్ రేమస్ ఆ ముసాయిదా అంతా చదివి సంతోషించాడు. దానితో అతనికి మళ్ళీ కొంత భరవసా వచ్చింది. తన అధికారం హుందాతనం అన్నీ—జ్ఞాపకం వచ్చాయి! తానొక గొప్పమంత్రిపుంగవుడు! ఆ హెచ్చరికలకు అర్థంపర్థం—ఏమీ లేదు! అంతా వట్టి హడావిడి! అసలు—లేనిపోని దానికింత హంగామా చేసిన ఆపోలీసులదే ఈ తప్పంతాను! ఇంక పత్రికలమాట! ఇవి ఎప్పుడు ఏదో ఒక గోలచేస్తూనే ఉంటాయి గదా! ఇవన్నీ ఒక లెఖ్ఖా!

మంత్రికి మళ్ళీ ఉత్సాహము, ఆవేశము అందుకున్నాయి. చిన్న చిరునవ్వు చిందులు తొక్కుతూ ప్రధాన కార్యదర్శిని అడిగాడు: "అన్నట్లు అయితే మన నేస్తాలమాటేమిటి? అన్నట్టు మరిచిపోయాను! ఆ దౌర్భాగ్యుల పేరేమిటి? "అపూర్వ హంతకులా?" నిజానికి మంత్రి వాళ్ళ పుట్టుపూర్వోత్తరాలు, పేరులు ఏవీ మరిచిపోలేదు! పైకిమాత్రం గమ్మత్తుగా నటించాడు! ఇటీవల రాత్రిం బగళ్ళకే నటన.

కాని కార్యదర్శికి మంత్రివగ్గర ఈ మాట తలపెట్టడంఅంటేనే హడలు! అత సెప్పుడూ ఆ ప్రస్తావన తీసుకురాడు. మంత్రే ముందుగా ఎత్తాడు కనక యాదాలాపంగా "మీకు తెలిసిన దానికంటె కొత్తగా ఏమీ తెలియదు! ఇంతకాలానికి ఆ థేరీ ఎవడో మాత్రం కొంచెం తెలిసింది! అయితే ఆ మిగిలిన ముగ్గురు ఎవళ్ళో ఏమీ ఆచోకీ తెలియదు!"

మంత్రి పెదవి కొరుక్కుని "వాళ్ళీ రాత్రిదాకా నాకు టైమిచ్చారు!" అన్నాడు.

మీకు మళ్ళీ వాళ్ళేమన్నా రాశారా?

"నాలుగైదు మాటలు!" అన్నాడుమంత్రి హేళగా.

"తరవాత"

మంత్రి లోకువగా బొమముడి విరి

# ★ అపూర్వ హంతకులు ★

"మొత్తంమీద వాళ్లంతం నెగ్గించుకునే టట్లే ఉన్నారు." అన్నాడు. ఆ కార్యదర్శి 'తరవాత' అన్నమాట అతనిగుండెలోతుల్లోకి దూసుకుపోయింది. కార్యదర్శి ఎందుకలా గన్నాడో మంత్రి కేమీ బోధపడలేదు.

*  *  *

ఇంక అక్కడ ప్లానులు తయారు చేసే గంటలో మేడమీద ఆ నలుగురు కూర్చున్నారు. ధేరీ హడలిపోయి, ఏమీ చెయ్యలేక దెబ్బతిన్నవాడిలా ఆ మిగిలిన ముగ్గురి కేసీ చూస్తూ కూర్చున్నాడు.

మాన్‌ఫ్రెడ్ అతనితో అంటున్నాడు:

"ధేరీ! నేను, చెప్పేదంతా జాగ్రత్తగా అర్థంచేసుకో! అయిందేదో అయిపోయింది. దానికి నీమీద మాకేమీ అక్కసులేదు. గోన్సాలెజ్ నీ ప్రాణాలు రక్షించి మళ్లీ నిన్నక్కడికి తీసుకువచ్చాడు. నేను, పాయ్‌కార్టు దీనికి చాలా సంతోషించాం.

ధేరీ కళ్లువాల్చి నేలకేసి చూస్తున్నాడు. మాన్‌ఫ్రెడ్ విచిత్రంగా ఒక చిరునవ్వు విసిరి—

"రేపు రాత్రి నీవు మాకిచ్చిన వాగ్దానం ప్రకారం ఆ కొత్త పనీచేసి పారెయ్యాలి, ఇంతకీ అంతటి అవసరం ఏర్పడితే మాట! ఆపైన నీవు వెళ్లిపోవచ్చును—."

అని వగంలో ఆ మాట ఆపేశాడు.

ధేరీ లోపలికోపం అంతా ఒక్కసారిగా వెళ్లగక్కాడు:

"ఇంక నేనెక్కడికి వెళ్లగలను? వాళ్లకి నా ఊరు, పేరు, కూడా చెప్పేశాను. పోలీసువాళ్లకి రాశారంటే నా ఆచోకీ అంతా తెలిసిపోతుంది. ఇంక మరి నేనెక్కడికి పోగలను?"

అని లేచి నుంచుని ఆ మిగిలిన ముగ్గుర్నీ అమాంతంగా తినేసేటట్లు చూశాడు. ఆ కోపం ఉద్ధృతంలో అతని ఒళ్ళంతా ఒణికి పోతూంది.

"నీ అంతట నువ్వే వెళ్ళి వాళ్లకి నీ సంగతి అంతా చెప్పేశావు. దానికిది తగిన శాస్తి. పోనీ దానికేం! స్పెయిన్‌లో నువ్వుండడానికి వీలైన జాగా ఒకటి చూస్తాంలే! అక్కడికి నువ్వు కన్నేసిన ఆ చిన్నది కూడా వస్తుందిలే!" అన్నాడు మాన్‌ఫ్రెడ్ ఏమీ చెక్కు చెదరకుండా.

ధేరీ వరసగా వాళ్ళందరికేసీ బాగా అనుమానంగా చూశాడు. వాళ్ళేమైనా తనని వేళాకోళం చేస్తున్నారా?

మిగిలిన వారి పెదవుల మీదక్కడా చిరునవ్వులు కనిపించడంలేదు. ఒక్క గోన్సాలెజ్ మాత్రం అతని కళ్లల్లో లోతుల అంతులు కనుక్కుంటున్నాడు.

"మీరన్న మాట ప్రకారం నిలబడతామని శపథం చేస్తారా? నిజంగా శపథం చేస్తారా?"

"తప్పకుండా—కావాలంటే ప్రమాణం కూడా చేస్తాను." అన్నాడు మాన్‌ఫ్రెడ్. తరవాత గొంతు కొంచెం తగ్గించి, "రేపు రాత్రి నీవు చెయ్యవలసిన పనేమిటో నీకు జ్ఞాపకం ఉంది కదా?" అన్నాడు.

ధేరీ తల ఊపాడు.

మాన్‌ఫ్రెడ్ తీవ్రంగా ఇలాగన్నాడు:

"ఈ పనిలో ఎక్కడా మాపువాసి పొరబాటు కూడా జరగకూడదు. నువ్వు, నేను, పాయ్‌కార్టు కలిసి ఇన్నివిధాలుగా దురన్యాయాలు జరుపుతున్న ఈ మంత్రిని చంపివేస్తున్నాం! హత్య జరిగిన తరవాత ప్రపంచం అంతా—ఇది ఎలా జరిగిందా అని నిర్ఘాంతపోవాలన్నమాట! పని అంతా ఒక్క క్షణంలో ముగిసిపోవాలి. ఎన్ని అడ్డంకులున్నా సరే! అవన్నీ దాటుకుపోయి ఒక్క దెబ్బలో మంత్రిని హతమార్చివెయ్యాలి! ఎంతమంది కాపలా కాస్తున్నా సరే! కనురెప్పపాటులో అందరి కళ్లు కప్పెయ్యాలి! జరిగిన తరవాత ఇంతటి అద్భుతం ఎన్నడూ కని విని ఎరగమని ప్రపంచంఅంతా ముక్కుమీద వేలు వేసుకుని నిలబడాలి—"

ఈ మాటలనగానే అతని చెంపలు కళ్లు జేవురించాయి! పాయ్‌కార్ట్, గోన్సాలెజ్ లిద్దరు చిత్రంగా - తీవ్రంగా అతని కళ్ళు పరిశీలిస్తున్నారు! మాన్‌ఫ్రెడ్ తిరిగి అందుకుని—

"మనం చేసే పనిగురించి ఏవో గొప్పగా మాట్లాడుతూ అసలు మన లక్ష్యంమాటే మరిచిపోయాను! పొరబాటు!" అన్నాడు మాన్‌ఫ్రెడ్.

"అబ్బే! ఇందులో అంత పెద్ద పొరబాటేముంది!" అన్నాడు పాయ్‌కార్ట్. గోన్సాలెజ్ ఆప్యాయంగా మాన్‌ఫ్రెడ్ బుజంమీద తట్టాడు.

తరవాత ముగ్గురు ఒక్క క్షణంసేపు ఏమనడానికీ పాలుపోక అలాగే నిలబడిపోయారు. మాన్‌ఫ్రెడ్ ఒక్క నవ్వు నవ్వి—

"ఇలా నుంచుంటే ఎలాగ? చాలా పని చెయ్యాలి!" అని పరిశోధనలు జరిపే గదిలోకి వెళ్ళాడు. మిగిలిన ముగ్గురు అతనివెంట పడ్డారు!

పరిశోధనచేసే గదిలోకి వెళ్ళగానే ధేరీ కోటువిప్పేసి నిలబడ్డాడు. ఆ వ్యవహారంలో మరి అతనిదే పై చెయ్యి! ఇన్నాళ్ళ నించీ పిల్లిలా అణిగిమణిగి ఉన్న మనిషి ఇప్పుడింక ఆ వ్యవహారానికంతటికీ అధిపత్యంవహించి పెత్తనం సాగిస్తున్నాడు! ఒక్క క్షణం క్రితం వాళ్లంటే హడలెత్తిపోయిన ధేరీ ఇప్పుడింక పట్టపగ్గాల్లేకుండా పని చేస్తున్నాడు!

ఈపైన ఇంకా చాలా పని జరగాలి! ప్రతి చిన్న విషయము పరిశోధించి నిగ్గు తేల్చుకోవాలి. సర్ ఫిలిప్ రేమన్ హత్యకోసం ఈ అపూర్వ హంతకులు నలుగురు సైన్సులో కనిపెట్టిన అత్యద్భుతమైన ఆధునిక రహస్యాలన్నీ ఉపయోగించేస్తున్నారు.

"మంత్రి భవంతి" ఆనుపానులన్నీ జాగ్రత్తగా ఆకట్టుకోవాలి! అన్నాడు మాన్‌ఫ్రెడ్ హఠాత్తుగా. వెంటనే లోపలికి వెళ్ళి

రెండు చిన్న నిశ్చెనలు చేత్తో దొరకబుచ్చుకుని ఆ మేడపై అంతస్తు డాబా వైపు నడిచివెళ్లాడు. డాబామీదికివెళ్ళి పిట్ట గోడ కానుకుని నిలబడి ఆ పరిసరం అంతా అతి జాగ్రత్తగా పరిశీలించాడు.

ఆ చుట్టూరా అరమైలు దాక లండన్ నగరం అంతా స్పష్టంగా ప్రత్యక్షమైంది. ఆ తరవాత అంతా ఫాక్టరీ గొట్టాలు! పొగ, దుమ్ము, దూళి మాత్రమే కనిపించాయి. మాన్‌ఫ్రెడ్ దూరదర్శినిసహాయంతో దూర దూరంగా కనిపించేమేడలు డాబాలు, అన్నీ బాగా పరిశీలనగాచూశాడు. కిందవీధులో జనసమ్మర్దం బాగా ఎక్కువగాఉంది. మాన్‌ఫ్రెడ్ మళ్ళీ డాబా ద్వారంలోనించి మెల్లి మెల్లిగా అడుగులు వేసుకుంటూ కిందికి దిగి వచ్చేశాడు.

"ఏం కనబడిందా!" అన్నాడు థేరీ ఉత్సాహం ఒలకబోస్తూ.

"ఆ యింటికొక గుర్తు వేశావే!" అన్నాడు మాన్‌ఫ్రెడ్.

"గుర్తువేస్తే పని బాగా తేలిక అవుతుంది. లేకపోతే రాత్రివేళ చీకటిలో తడుము లాడుకోవాలి మరి!" అన్నాడు థేరీ.

"అయితే ఆనవాలు బాగా కనబడిందా?" అన్నాడు పాయ్‌కార్ట్.

మాన్‌ఫ్రెడ్ తల ఊపి - "పార్లమెంటు భవనం కొంచెం అస్పష్టంగా కనిపిస్తోంది. డౌనింగ్ స్ట్రీట్ మేడలపై అంతస్థులన్నీ అలుముకుపోయినట్లు కనిపించాయి" అన్నాడు.

తరవాత థేరీ మళ్ళీ తన పనిలో మునిగి పోయాడు. అతనేపని మొదలెట్టినా అందులో సిద్ధహస్తుడే అనిపించుకుంటాడు. ఆపైన ప్రస్తుతంచేసే పనిలో మరీ పట్టుదలగా పనిచేస్తున్నాడు. ఇన్నాళ్ళనించీ మిగిలినవాళ్లంతా మరి తామే ఘనుల మన్నట్లు వ్యవహరించారు. ఇప్పుడిక తన చాకచక్యం అంతా ఉపయోగించి తన గొప్ప నిలబెట్టుకోవాలి! కనకనే థేరీ ఇంత పట్టుదలగా పనిచేస్తున్నాడు.

మిగిలిన వాళ్ళంతా థేరీ చేసేదంతా కను రెప్ప వెయ్యకుండా పరిశీలిస్తున్నారు. గొన్సాలెజ్ బొమముడి విరిచి అదే పనిగా థేరీ ముఖం పరిశీలిస్తున్నాడు. ఇతడు సైన్సు లోను, మానవస్వభావ పరిశీలనలోను చాలా గట్టివాడు. ఈ హంతకునికీ వ్యవహారంలో ఇంతటి చాకచక్యం ఎలాగ కలిగిందా అని ఆశ్చర్యపడుతున్నాడు.

కొంతసేపటికి థేరీ తనపని ముగించాడు- ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టాడు: "అబ్బా! ఇప్పటికీ పనిఅంతా పూర్తి అయింది. ఇప్పుడు కవర ఆ మంత్రి నాతో ఒక్కనిమి

# ★ అపూర్వ హంతకులు ★

కం మాట్లాడితే చాలు! ఆ ముందుక్షణంలో అతనిపని అయిపోయిం దన్నమాటే!"

సామాన్యంగా చూసినప్పుడే అతనిముఖం చాలా అందవికారంగా కనబడుతుంది. మరి ఇప్పుడు చూస్తే దానిలో రాక్షసత్వం అంతా మూర్తీభవించినట్టే ఉంది. అతని ముక్కు కోణాలు పొగరెక్కిన ఆంబోతు ముక్కు కోణాల్లాగ నురగలు గక్కుతున్నాయి!

మిగిలినవారి ముఖాలెక్కడా చెక్కు చెదరినట్లు కనిపించడం లేదు. పెద్ద ఉత్సాహం గాని "అయ్యో! ఇలాంటిపని చేస్తున్నామే" అనే కించ గాని వారిలో ఎక్కడా కనిపిచటం లేదు! కేవలం శిక్ష విధించే న్యాయమూర్తి గాంభీర్యం మాత్రమే వారి ముఖాల్లో తాండవించింది! ధేరీ కది చూచాయగా పొడగట్టింది! అంతే! దానితో అతని లోలోపలి ఉడుకురక్తం అంతా ఒక్కసారి గడ్డకట్టుకుపోయింది!

చేసేపని అమాంతంగా ఆపేసి, గట్టిగా అరుస్తూ—"చాలు! చాలు! నాకేసి అలాగ చూస్తారేమిటి? వద్దు! చూడవద్దు!" అని రెండు చేతులతోను మొహం కప్పేసుకున్నాడు!

"అదేమిటి ధేరీ! అలా అంటున్నావు!" అన్నాడు గోన్సాలెజ్ ఎక్కడా చెక్కు చెదరకుండా!

"నాకేసి మీరేదో పెద్ద హైకోర్టుజడ్జీల్లా చూస్తున్నారేమిటి!" అన్నాడు ధేరీ.

"అవును! మేము జడ్జీలమే! అంతేగాదు! మా శిక్షలమలు పరిచేదీ మేమే!"

"నేను చేసేదంతా చూసి మీరంతా మెచ్చుకుంటున్నారను కున్నాను." అన్నాడు ధేరీ విసుగ్గా!

"నువ్వు చేసిన పని భేషుగ్గా ఉంది!" అన్నాడు మాన్‌ఫ్రెడ్.

"రైట్" అన్నారు మిగిలిన వాళ్లిద్దరూ.

"దైవ కృపవల్ల పని అంతా బాగా సానుకూల పడాలి గదా!" అన్నాడు మాన్‌ఫ్రెడ్. ధేరీ కనురెప్ప వెయ్యకుండా విస్తుపోతూ అదే పనిగా అతనికేసి చూశాడు.

* * *

మంత్రి ప్రాణ సంరక్షణ కోసం చేసిన బందోబస్తులన్నీ పూర్తి అయిపోయాయని సూపర్నెంట్ ఫాల్‌మాత్ పోలీసు కమిషనరుకు ఖుద్దున విశదపరుచుకున్నాడు. "44 డౌనింగ్ స్ట్రీట్ భవంతిలో అంతటా గట్టిగా కట్టుదిట్టాలు చేశాం. ఇంచుమించుగా ప్రతీ గదిలోను ఒక్కొక్క మనిషిని కాపలా వేశాం. పిడిరాళ్లలాంటి వాళ్ళని నలుగురుని డాబా మీద నిలబెట్టాం! ఆఖరికి వంట గది కూడా విడిచిపెట్టలేదు!"

"అయితే మరి నాకర్లమాట!" అన్నాడు పోలీసు కమీషనర్.

"మంత్రి స్వయంగా తమ పని మనుషుల్ని పిలిపించుకున్నారు. ఇక ఇప్పుడిక్కడపనిచేసే వాళ్ల పుట్టుపూర్వోత్తరాలన్నీ మనకి పూర్తిగా తెలుసునన్నమాటే!"

కమీషనర్ తేరిక పెద్దనిట్టూర్పు విడిచిపెట్టాడు:

"రేపు ఒక్కరోజు గడిచిపోయిందంటే మనం బ్రతికి బైటపడ్డామన్న మాటే! ఇక మిగిలిన అన్ని ఏర్పాట్లు పూర్తిఅయిపోయాయన్నమాటేనా?"

"ఆఁ అయిపోయాయి! ఇక వాటిల్లోమార్పేమీ లేదు. మంత్రికూడా అవి అయిపోయిన తరువాత ఇక్కడికి వచ్చేశారు. రేపల్లా ఎనిమిదిన్నర దాకా ఆయన ఇక్కడే ఉంటారు. తరవాత 9 అవగానే చట్టం ప్రవేశపెట్టడానికి పార్లమెంటు భవనానికి వెళ్ళిపోతారు. 11 అయ్యేసరికి మళ్లీ తిరిగి వచ్చేస్తారు."

"పావు తక్కువ తొమ్మిది మొదలుకొని తొమ్మిదిం బావుదాకా అక్కడ రాకపోకలలో మార్పులు చెయ్యమని కూడా ఆర్డరు పంపించాను. ముందు నాలుగు గుర్రబ్బగ్గీలుంటాయి. అవి పూర్తిగా మూసేస్తారు. ఫిలిప్‌రేమన్ ఆ తరవాత ప్రత్యేకంగా ఒక కారులో వెడతారు."

ఈ సంభాషణ అంతా కమిషనర్ ఆఫీసులో నడుస్తూంది. ఇంతలో ఎవరో తలుపు తట్టారు. ఒక పోలీసు లోపలికి వచ్చాడు. చేతిలోఉన్న విజిటింగు కార్డు కమిషనరు బల్లమీద పెట్టాడు. కమిషనర్ అది తీసి జోన్ దో సిల్వా' అని చదివాడు. వెంటనే ఈయన స్పెయిన్ పోలీసుకమిషనర్. లోపలికి తీసురండి!" అన్నాడు సూపర్నెంటుతో. జోన్ దోసిల్వా లోపలికివచ్చాడు. పొట్టిగా కుదిమట్టంగా ఉన్నాడు. ముక్కు, గడ్డం కొట్టొచ్చినట్టున్నాయి. అతి వినయంగా నమస్కరించాడు. పరిచయాలు కరచాలనాలు జరిగిన ఇంగ్లండ్ తదనంతరం కమిషనర్ అన్నాడు:

"మిమ్మల్ని ఇక్కడకి పిలిపించక తప్పలేదు. ఈ ధేరీని పట్టుకోవడంలో మీరేమన్నా సాయం చేస్తారేమోనని ఆశ."

ఆ స్పెయిన్ ఉద్యోగి ఇలాగన్నాడు: "అదృష్టవశాత్తు మీ కబురందేసరికి నేను పారిస్‌లో ఉన్నాను. ధేరీసంగతి నాకు తెలుసును! "ఈ హేమాహేమీలతో చేతులు కలిపాడే!" అని కొంచెం ఆశ్చర్యపడ్డాను. ఇక ఈ 'అపూర్వ హంతకుల' సంగతి! మా దేశంలో వీళ్లమీద ఒక కేసు నడుస్తూంది. ఈ ధేరీది ఆట్టే అంత పెద్ద చెయ్యి కాదు. అతడీ నలుగురుతోను కలిశాడంటే నేను మొట్టమొదట నమ్మలేకపోయాను!"

ఆ తరవాత పోలీస్ కమిషనర్ అక్కడ పడిఉన్న స్పెయిన్‌భాష ప్రకటన ఒకటి తీసి, కొంచెంచదివి,, "ఇది ఆట్టే అంత ముఖ్యంగాదుగాని మీవాళ్ళు ధేరిచేసే వ్యాపారం ఏదో రాయడం మరిచిపోయారు" అన్నాడు.

స్పెయిన్ ఉద్యోగి కనుబొమలు విరిచి "ధేరీ వ్యాపారమా? ఉండండి! కొంచెం జ్ఞాపకం చేసుకుంటాను." అని కొంత సేపాలోచించాడు.

తరవాత "నా కంత బాగా జ్ఞాపకం రావడం లేదుగాని—ఏదో రబ్బరు వ్యాపారంతో అతనికి సంబంధం ఉండేదని జ్ఞాపకం! మొట్టమొదట రబ్బరు ఎత్తుకుపోయాడనే అతనిమీద ఒక కేసు పెట్టారు. కాని ఇంకా స్పష్టంగా తెలుసుకోవాలంటే—" అని సగంలో ఆగాడు.

పోలీసు కమిషనర్ ఒక్క నవ్వునవ్వి— "ఆఁ అదేమీ అంత ముఖ్యంకాదు! అతని వ్యాపారం ఏమైతే మనకేం!" అన్నాడు.

—ఇంకా ఉంది

"షేక్స్‌పియర్ ఈనాడు సజీవుడై ఉంటేనా..."

"మరే. 350 ఏళ్ళ వండు ముసలి అయిఉండేవాడు. అతనే ఉండిఉంటే, అంత పెద్దవాడు ఇంకోడు ఉండకపోను."

# బొమ్మరూపాయి

చాగంటి తులసి

"ఏమర్రోయి యిల్లు జాగ్రత్త," అని బామ్మ మూడోసారి హెచ్చరించింది.

"వేగిరమే వచ్చేస్తాం. అంతగా కాక పోతే మీ ముగ్గురూ అన్నాలు తినేండి. అన్నీ నట్టింట్లోనే పెట్టేను. మజ్జిగ పెద్ద చత్తెప్పెలాలో ఉంది. తలుపులు తీసేసి యింట్లో కుక్కని మాత్రం పెట్టకండి" అంది అమ్మ.

"అబ్బ అలాగేనే బాబూ. వెళ్ళిరండి," అని విసుక్కుంది అక్కయ్య.

"రాణీ మరీ పొద్దెక్కి పోతోంది," అని చేతిలో ఉన్న కొబ్బరికాయని ఆడించింది బామ్మ.

"పదండి" అని అరటిపళ్ళనీ, ఊదొత్తులనీ పట్టుకుని అమ్మ బయల్దేరింది. వీధి గుమ్మందాకా వెళ్ళి 'జాగ్రత్తర్రోయి', అని మళ్ళా కేకేసి అమ్మా బామ్మా శివకోవిలకి దారితీసేరు. ఆవేళ శివరాత్రి.

"ముగ్గురం ఉన్నాం! జాగ్రత్త జాగ్రత్త అని చెప్పేదేవిటి? వీళ్ళతో వచ్చిన చిక్కే యిదీ." అన్నాదక్కయ్య.

"ఇంకా గుంటలం కదా అని వాళ్ళలా చెప్తారు," అన్నాడు తమ్ముడు.

"మీరంటే గుంటలు నేను లేనూ?" అని సాగదీసుకుంది అక్కయ్య. దానికీ బామ్మ వాళ్ళతో కోవిలకి వెళ్ళాలని ఉంది. యింట్లో ఎవరూ లేరని దాన్ని వదిలేసి మరీ వెళ్ళేరు.

"ఇంతకీ జాగరం మాటర్రా?" అన్నాను.

"నేనుంటాను. మీరొద్దన్నా మానను. మీతో శే ఉండేవిటి? తెల్లవార్లూ లెక్కలు చేసేస్తాను," అన్నాడు తమ్ముడు.

"ఆఁ చేసేస్తావు! ఏం శ్రద్ధా వస్రాడికి! లెక్కలే చేస్తే ఓ గంటకే కుక్క ముట్టుకుంటుందిలే," అన్నాదక్కయ్య.

"పాపం అబ్బాయిగారికి నిరుడూ అంతే అయింది," అన్నాను

"ఆఁ ఆఁ మహా చెడ్డ మిమ్మల్ని ముట్టుకి కుక్క ముట్టుకోలేదూ? నన్ను పొద్దున్నే ముట్టుకుంటే మిమ్మల్ని సాయంత్రం ముట్టుకుంది. మర్నాడు రాత్రి ఎనిమిదింటివరకూ ఉంటేనే ఉన్నట్టు లెఖ్ఖ?" అని తమ్ముడు కళ్ళెగరేసేడు. నిజమే. నిరుడు అక్కయ్యా నేనూ సాయంత్రం ఐదింటికే పడకేసేసేం.

"ఏడిసేవ్ మమ్మల్నేం ముట్టుకోలేదు. నే నీమాటు అమ్మ వాళ్ళతో పేకాడతాను," అంది అక్కయ్య.

"వెధవ్వేషం మమ్మల్నిద్దర్నీ వదిలేసి పెద్దవాళ్ళతో చేరిపోదువుగాని, అలా వీల్లేదు. నువ్వూ మాతో శే ఉండాలి." అన్నాను.

ఎపోనీవే వెళ్ళమను. పేకే ఆడమను. శివరాత్రినాడు పేకాడితే ఫలం ఏమిటి? నాబుర్ర!" అన్నాడు తమ్ముడు. వీడొకొక్కప్పుడు నాన్న అనేమాటల్ని టపాదించేస్తూ ఉంటాడు. నాన్నకి ఉపోషాలూ, ఉప్పెట్లూ పూజలూ పునస్కారాలూ అక్కర్లేదు. అమ్మనీ బామ్మనీ వెక్కిరిస్తూ ఉంటాడు. "మీ ఉపోషాలు బంగారం గానూ! పొద్దున్న తిండి మానేసి దానికి డబుల్‌గా పిండివంటలతో రాత్రి కొట్టేడమా?" అంటాడు నాన్న. శివరాత్రినాడు స్మార్తుల్లో కటిక ఉపవాసం ఉంటారు కాని మా ఆరాధ్యుల్లో అంతే! శివరాత్రి కార్తీక సోమవారం పద్ధతినే. ఇంక రాత్రి జాగరం అమ్మా, పొరుగింటి పిన్నమ్మా, మరో ముగ్గురూ కూడి తెల్లారే వరకూ "ఎత్తుపం" దమ్మిడీలు వేసి ఆడేస్తారు. అందుకే నాన్న వాళ్ళని వెక్కిరిస్తూ ఉంటాడు.

"లెక్కలు చేసేస్తే వచ్చేస్తుంది పుణ్యం" అని చేతులాడించింది అక్కయ్య. దానికి దేముడూ, దెయ్యం, పూజా పునస్కారాల మీద చచ్చేటంత నమ్మకం.

"పుణ్యం వాడికీ అక్కర్లేదు. నాకూ అక్కర్లేదు. అదేం కడుపు నిండే వస్తువా? కళ్ళక్కన పడే వస్తువా? లెక్కలు చేస్తే బాగా మార్కులన్నా వస్తాయి" అన్నాను.

"అవునే చిన్నక్కా పెద్ద పరీక్షల్లో ఫస్టుమార్కు నాదే చూసుకో" అన్నాడు చూపుడు వేలు ఆడిస్తూ. తమ్ముడికి లెక్కలంటే యిష్టం.

"చేసుకోండి చేసుకోండి లెక్కలే చేసుకోండి నాకేం? నేను పేకే ఆడతాను" అంది అక్కయ్య.

"అబ్బే నువ్వు పేకాడ కూడదు, ఓం నమశ్శివాయ అని జపం చేస్తూ జాగరం చెయ్యాలి. పుణ్యం వస్తుంది పుణ్యం" అని వెక్కిరించేడు తమ్ముడు.

"వెధవా తాపులు తినగలవు" అని అక్కయ్య కోపంగా చూసింది. ముగ్గురమూ చీడీమీదకొచ్చిన ఎండలో కెళ్ళి కూర్చున్నాం. తొమ్మిది గంటలైంది. ఎండ వేడెక్కుతోంది. శివరాత్రితో గాని చలి శివశివా అని పోదు.

"ఆ దరిద్రది యింట్లో కొచ్చేస్తోంది!" అని అక్కయ్య వీధి గుమ్మం కేసి చూసింది. ఓ ముసలమ్మ. చాలీచాలని పంచె కట్టుకుని ఓ చేత్తో కర్ర పట్టుకుని రెండో చెయ్యి ఓ పిల్లాడి భుజంమీద వేసివస్తోంది. కుర్రాడూ చిన్నవాడే. సరిగ్గా తమ్ముడంతే ఉన్నాడు.

"ముష్టిముండలాఉంది. వెళ్లి తలుపు గడి

ఓ రూపాయి తీసుకొచ్చి ముసలమ్మ చేతిలో పెట్టేను. అక్కయ్య మిడుతూ మిడుతూ చూడ్డం తప్పించి మమ్మల్నింకేం చెయ్యలేక పోయింది.



# బొమ్మ రూపాయి



...యేసేరా," అని అరిచిం దక్కయ్య. తమ్ముడు కదల్లేదు. వాడు పరిశీలనగా ఆ కుర్రాడివేపు చూస్తున్నాడు.

"వెధవ్వి నువ్వెళ్ళక పోతే ఉండిపోతుం దను కున్నా వేమిటి?" అని అక్కయ్య ఛటీ మనిలేచి వెళ్ళబోయింది. అది వెళ్ళే సమయానికి కర్రతో టక్ టక్ మని చప్పుడు చేసుకుంటూ ముసలమ్మ కుర్రాడూ సావిడి దాటి చీడీమీద కొచ్చేసేరు.

"ఇంట్లో కొచ్చేస్తున్నా వేవిటి? అక్కడే ఉండు" అని అక్కయ్య కసిరింది.

"మేమూ బ్రాహ్మలమేనమ్మా. మీబొమ్మ గారి కోసం వచ్చేం" అని జవాబు చెప్పింది ముసలమ్మ. నూతిలో మాటల్లా ఆవిడ గొంతుక లోంచీ ఆమాట లీవతలికొచ్చేయి. కుర్రాడు బిక్క మొహం వేసేడు.

కూర్చున్న తమ్ముడు దభీమని లేచి, "నీ పేరు రామారావు కదూ?" అని ఆ కుర్రాణ్ణి అడిగేడు. బుర్రూపేడా అబ్బాయి.

"రారా అక్కడే నిల్చున్నా వేమిటి? రండి బొమ్మగారూ రండి" అని తమ్ముడు వాళ్ళని ఆహ్వానించేడు. అక్కయ్య మొహం కోపంతో నిండిపోయింది. ఎవరో వెధవల్ని పెద్దవాడిలా మర్యాద చేస్తున్నాడు. గుంట వెధవ యింతున్నాడో లేడో తమ్ముడికి పెత్తనం కావూ! ఆ ముసలమ్మ ఎర్రని సైను పంచె - పంచెకూడా కాదు. సైను గుడ్డ ముక్క ఒంటికి చుట్టబెట్టుకుంది. ముసుగు బుర్రని సగంవరకే మూసింది. మిగతా సగం ఒత్తుగావున్న పండు వెంట్రుకలతో అసహ్యంగా కనపడుతోంది. కళ్ళూ దవడలూ లోతుకు కూరుకుపోయి ముక్కొక్కటే మొహంలో పైకిలేచి కనపడుతోంది. కర్రని కిందపడేసి, పంచని పాదాల వరకూ లాక్కుంటూ, ముడిచి పెట్టుకొని ఎండలో కూర్చుంది. కుర్రాడూ ఆవిడ పక్కనే కూర్చున్నాడు. చిరిగిపోయిన కాకీ చొక్కా, పొట్టిగా ఉన్న లాగూ వేసుకున్నాడు. మొహం పీక్కుపోయున్నా కళ్ళు తేలగా కనపడుతున్నాయి.

"అక్కయ్యా ఈ అబ్బాయి ఫుట్‌బాలెంత బాగా ఆడతాడనుకున్నావ్? మొన్న మా స్కూలుకీ వీళ్ళ స్కూలుకీ అయిన పోటీలో ఈ అబ్బాయి చాలాబాగా ఆడేడు," అన్నాడు తమ్ముడు. ఆ అబ్బాయి కళ్ళు మిలమిల్లాడేయి. పీక్కుపోయిన మొహంలోకి కళొచ్చింది. అక్కయ్య తమ్ముడు చెప్పే మాటలు వినిపించుకోలేదు. దానికి వీళ్ళని చూస్తే కడుపులో గాభరా పుట్టింది.

"మా బొమ్మ కోవిలకెళ్ళేరండీ," అని చెప్పింది వాళ్ళని పంపించడానికిచూస్తూ.

"అవును శివరాత్రికదూ? కోవిల కెళ్ళే రన్నమాట. నాకెప్పుడూ కోవిలాకూడా ఎక్కడ? దైవరాత! తిరిగేసరికే తెల్లారిపోతోంది. ఇలా తిరుగుతూనే వాడికి మొర పెడుతూ ఉంటాను. ఏంచేస్తాను? ఆ ఈశ్వరుడు నన్ను సరిగ్గా చూట్టంలేదు," అని ఉసూరుమంది ముసలమ్మ. కుర్రాడి మొహంలో మళ్ళా దిగులు కనపడ్డాది.

"నువ్వా సెకండ్ ఫారమేకదూ చదువుతున్నావ్?" ఆ అబ్బాయిని తమ్ముడడిగేడు.

"అవును" అని బుర్రతిప్పేడా అబ్బాయి.

"మా మేష్టారు చెప్పేరు. ఈ అబ్బాయి హైస్కూల్లో చదువుతున్నా నాకీకుర్రాణ్ణి అందుకే తెల్సు," అన్నాడు తమ్ముడు.

"ఆ మేష్టరేనాయినా. ఒద్దు లాక్కు రావడానికి కొస్త చెయ్యిస్తున్నారు. లేక పోతే ఈ గుడుగుడు ప్రాణాన్ని నేనూ వది లేద్దును," అన్నాది ముసలమ్మ. తమ్ముడూ నేనూ ఆవిడ చెప్పేమాటల్ని జాగ్రత్తగా వింటున్నాం. వీళ్ళ నెలా పంపించడమా అని చూస్తోం దక్కయ్య.

"మీ అమ్మగారు వంటొండుతున్నారా?"

"మా అమ్మకూడా కోవిలకెళ్లింది. మేమే ఉన్నాం" వెంటనే చెప్పేసింది అక్కయ్య.

"ఇప్పుడెప్పుడే రారా?" అని ఆ అబ్బాయి అతృతగా అడిగేడు.

"అబ్బో! ఇప్పుడెక్కడ వస్తారు? వాళ్లిప్పుడే వెళ్ళేరు. పైనా మా బామ్మ ముక్కార్తి దీపం వెలిగించాలి. అమ్మవారికి పూజచేయించాలి. చాలా సేపే అవుతుంది" అన్నాదక్కయ్య.

"వెర్రి నాగమ్మవి. కోవిల కెళ్ళింతర్వాత వెంటనే ఎలా వచ్చేస్తార్రా? అందులోనూ ఇవాళ పర్వదినం. దర్శనం అవడమే కష్టమైపోతుంది" అన్నాది ముసలమ్మ.

"అయితే బామ్మా..." అని సహంలో ఆపీసేడు రామారావు. ముసలమ్మ కుర్రాడి నెత్తిమీద చెయ్యేసి "ఉండరా నాయనా కాస్సేపు కూర్చుని అలసటన్నా తీర్చుకోనీ. మీ బామ్మగారూ నేనూ స్నేహితులమే నమ్మా. మేము కోవెళ్ళలో పురాణం ఒకచోట కూర్చునే వింటాం. మీ బామ్మ పెద్ద జ్ఞాని. నాకన్నీ బోధపరుస్తూ ఉంటారు. ఆవిడున్నారనుకొని వచ్చేను" అన్నాది.

"ఏమండీ బామ్మగారూ, మావాళ్ళొచ్చే వరకూ ఉండండి. లేకపోతే ఏమిటో మాతో అపితే మా బామ్మకి చెపుతాం," అన్నాను. చెక్కయ్య నావేపు ఉరిమినట్టు చూసింది. దానికి నన్నూ తమ్ముణ్ణీ మింగేయాలని ఉంది.

"ఏం చెప్పమంటావమ్మా. నా ప్రారబ్ధం. మీ బామ్మగారికంతా తెల్సును. అందుకే వచ్చాను. ముసలి కాలానికి ముప్పతిప్పలూ పడుముండా అని దేవుడు నాకూపిరి వాసేడు. బొడ్డూడని గుంటడు. వీడేం చేస్తాడు? వెనకాతలే వళ్ళి నలుగురితో చెప్పకురాంకే ఎలా కుదురుతుంది?" వాడికి అమ్మని అబ్బనీ అందర్నీ నేనే" అని విచారంగా చెప్పింది ముసలమ్మ.

"అవును మా మేష్టారు చెప్పేరు. పాపం రామారావుకి అమ్మా నాన్నా లేరుట!" అని తమ్ముడు జాలిగా బుర్రూపేడు.

"అయ్యో పాపం అలాగా?" అన్నాను. అక్కయ్యంత కోపంలోనూ కుర్రాడివేపు తేరిపారి చూసింది. రామారావుకు వాళ్లమ్మా నాన్నా జ్ఞాపకం వచ్చి గుడ్లలో నీళ్ళు తిరిగేయి.

"వాడెళ్లిపోయేడు. తొక్కని నేనుండిపోయేను. కాటి క్కాళ్లు జాచుకున్న నన్నొదిలేసి ఆదిక్కుమాలిన దేవుడు వాణ్ణి తన్నుకుపోయేడు. పెద్ద జబ్బన్నా లేదు. ఈ మంగళారం ఊష్టం వచ్చింది. మళ్ళా బుధవారం కొట్టేసింది. మాయదారి ఊష్టం. ఆ డాక్టరు వచ్చిపోయే వరకూ పర్వాలేదనే అన్నాడు. వాడి మొహం ఈడ్వా! ఏం లేదనే అన్నాడు. వెధవ్యాష్టం నా బాబుని, నా బంగారుతండ్రిని పట్టుకపోయింది. చెట్టంత బాబునీ కడుపున పెట్టుకున్నాను" అని ముసలమ్మ రెండు బెక్కులుబెక్కి కళ్లు తుడుచుకుందికి పంచెని లాక్కుంది. బుర్ర మీదున్న సహం ముసుగు జారిపోయి బుర్ర అంతా అసహ్యంగా కనపడుతోంది.

రామారావు చొక్కాతో కళ్లు తుడుచుకున్నాడు. తమ్ముడు బిక్కమొగ మేసేడు. ఆవిడ ఏడుస్తూంటే నా కళ్ళంటా నీళ్లు తిరిగేయి. అక్కయ్య బుర్రొంచుకూర్చుంది.

"ముసలి ముండని. బుద్ధిలేకుండా మీతో చెప్పి మిమ్మల్ని బేజారెత్తించినట్టున్నాను. నా కొడుకు జ్ఞాపకం వచ్చి నేనెవరితో చెపుతున్నానో కూడా మర్చిపోయేనమ్మా. వీడు పుట్టి తల్లిని చంపేడు. పెరిగి తండ్రిని చంపేడు. వాడు దిక్కులినవాడయ్యేడు. నన్ను నట్టేట్లో ముంచేసేడు. ఇంకా ఏదో అందరూ దయతలుస్తున్నారు కాబట్టి ఏదో యిలా నెట్టుకొస్తున్నాను. వీడి కదృష్టం లేకపోయింది నాయినా, వాళ్ల నాన్న బతికుంటే ఈ ఖర్మం లేకపోయేది. పువ్వులమ్మిన ఊళ్లో కట్టెలమ్మవలసి వచ్చింది. ఎంత గౌరవంగా బతికేవాళ్లం? నిక్షేపం లాంటి ఉద్యోగం. నా కొడుకు కలక్టరాఫీసులో గుమాస్తా! రాజాఅయిన బతుకు. నాకే గతుంటే వాడెలా బతుకుతాడూ? వాడి పిల్లాడికి అన్నం లేకుండా ఉంది," రామారావు వాళ్ళ బామ్మనంటి పెట్టుకుని ముణుకుల్లో తలదూర్చుకున్నాడు. వాడి బుర్ర కొబ్బరిపీచులా ఎగురుతోంది.

"ఎక్కడెన్నా చాకిరీ చేద్దామన్నా ముసలి తొక్కనైపోయేను. కళ్లు కనపడవు. మూడు కాళ్ళ మనిషిని. ఏం చేస్తాను? వీడికి తెలివితేటలతోపాటు ఆకలీ ఎక్కువే. ఎంత పెట్టినా చాలదు. అందరూ తలో రూపాయో, అర్ధో యిచ్చి దయతలిస్తేనే వాడీ పరీక్షలు గట్టెక్కుతాడు" అన్నాది ముసలమ్మ. చెట్టంత కొడుకు చచ్చిపోయి ఈ మనవణ్ణి సాకవలసి వచ్చింది. ముసలి కాలంలో యిలాంటవస్తే ఏం దారి?

తమ్ముడు ఒక్క గుటుకున లేచి యింట్లోకి పరిగెట్టేడు. అక్కయ్యా నేనూ వాడు వెళ్ళినవేపు చూస్తూ ఉండిపోయేం. లోపల పెట్టెలు ఈడ్చి డబడబమని చప్పుడు చేస్తున్నాడు తమ్ముడు. "ఒరేయి" అని ఓ గావుకేక పెట్టింది అక్కయ్య. వాడేం చేస్తున్నాడో అది కనిపెట్టేసింది. దాని కేకని వాడు లక్ష్యపెట్టలేదు. ఓ చొక్కా లాగూ పట్టుకుని యివతలికి వచ్చేడు. చొక్కా లాగూ వేపు ఆశగా చూస్తూ అక్కయ్య మొహాన్ని తేరిపారిచూసేడు రామారావు.

తమ్ముణ్ణి చూస్తూనే మళ్ళా అరిచిందక్కయ్య "ఒరేయ్" అని.

"ఏమేఁ."

"అమ్మ తన్నీగల్దు."

"నా చొక్కా నా లాగూ నా యిష్టం. ఎందుకు తంతుంది?" తమ్ముడు బుర్ర ఝాడించేడు.

"రామారావ్ తీసుకోరా" అని ఆ అబ్బాయి చేతిలో పెట్టేసేడు.

## త్వరలోనే

ఇంటి యజమాని: ఏవయ్యా. ఇంటద్దె ఇవ్వదలచుకో లేదా? ఏమిటి నీ ఊహ?

కవి: ఏముందండి. పుస్తకాల కంపెనీవారు చెక్కు పంపెయ్యగానే ఇచ్చేస్తా?

"వాళ్లెప్పుడు పంపేటట్టు."

"నా నవల నచ్చగానే"

"ఎప్పటికి జరుగుతుందది?"

"ఏముంది. నేను రచన పూర్తిచేసి పంపడం తరువాయి"

"అదెన్నాళ్లకి?"

"అహోరాత్రాలు ఆలోచిస్తున్నాను ఏంకథ రాద్దామా అని. అది తేలిపోగానే, కాస్త 'మూడ్' కుదరగానే రాసెయ్యగానే, పంపెయ్యగానే, వాళ్లు చదివెయ్యగానే, నచ్చగానే, వెంటనే, వారు చెక్కు పంపెయ్యగానే..."

"మీరు చెక్కు మార్చగానే, నాకు డబ్బు కట్టెయ్యగానే, మళ్లా వచ్చి ఈ ఇంట్లో దిగొచ్చు. ఇవాళ ఖాళీ చెయ్యండి."

 

# బామ్మ రూపాయి



"మీ అమ్మ నడిగే యియ్యి నాయనా" అంది ముసలమ్మ.

"ఫర్వాలేదండీ మా అమ్మేమీ అందు" అన్నాను. అక్కయ్య నావేపు కొరకొరా చూసింది. దానికి మొదట్నించీ వాళ్ళని పంపించీయాలని ఉంది. ఆవిడని కూచో పెట్టి ఆవిడ చెప్పిందంతా విని, యిప్పుడు మేం చేసిన పనికి దానికి ఒళ్లుమండింది. అక్కయ్యంటే నాకూ తమ్ముడికీ కూడా భయం లేదు.

"చిన్నక్కో బామ్మకి నాన్న రూపాయి లిచ్చీసేడు కదూ?" తమ్ముడడిగేడు. ప్రతీ నెలా బామ్మకి ఐదు రూపాయిలు నాన్న యిస్తూఉంటాడు. ఒత్తికీ పత్తికీ, బ్రాహ్మడి కిచ్చుకోడానికీ, మా రాము చేస్తే మాకివ్వడానికీ బామ్మ ఆ డబ్బు ఉపయోగిస్తూ ఉంటుంది.

"అవున్రోయి. మూబాగా జ్ఞాపకంచేసేవు. భాగవతంలో మూడు రూపాయలు పెట్టింది" అన్నాను.

"అవిమాత్రం తియ్యకండి. బామ్మ బుర్ర బద్దలు కొట్టేస్తుంది" అని అక్కయ్య లేచి నిల్చుంది.

"నా బుర్రేమీ బద్దలు కొట్టదు. నే నెవరి నను కొంటున్నావ్? నా పేరు తాతయ్య పేరు తెల్సా? బామ్మ నాకు పెళ్ళాం అవుతుంది. మరేం ఫర్వాలేదు" అన్నాడు తమ్ముడు.

"అలా అన కూడదు. తప్పు నాయినా" అంది ముసలమ్మ.

"మా బామ్మే అలా అంటుందండీ" అన్నాడు తమ్ముడు.

"నామాట విని అవి ముట్టుకోకు. నీది తాతయ్యపేరైనా బామ్మూరుకోదు" అన్నా దక్కయ్య.

"నన్ను దెబ్బలాడ దన్నానా? పోనీ, నన్ను దెబ్బలాడితే మధ్య నీకేం?" అన్నాడు తమ్ముడు.

"మీతో పాటు నన్నూ దెబ్బలాడతారు. చేసేది మీరూ, తిట్లు తినేది నేనూనూ" అన్నా దక్కయ్య.



"నిన్ను తిట్ట నివ్వంలే. అమ్మా వాళ్లా యిప్పుడప్పుడే రారు. వీళ్లెంతసేపు కూర్చుంటారు?" లోపల కెళ్ళేను. అక్కయ్య నావెనకాతలే వచ్చి మీద పడ్డాది.

"ఆగుంట వెధవకి బుద్ధిలేక పోతే పెద్ద దానివి నీకూ లేదూ?"

"మరే మా యిద్దరికీ లేదు. మా యిష్టం, మేం యిచ్చుకుంటాం;" అని భాగవతంలోది ఓ రూపాయి తీసుకొచ్చి ముసలమ్మ చేతిలో పెట్టేను. అక్కయ్య మిడుతూ మిడుతూ చూడ్డం తప్పించి మమ్మల్నింకేం చెయ్యలేక పోయింది.

"నాతల్లే నాతల్లే మీఅమ్మకడుపు చల్లగా మంచి మొగుడొచ్చి..." అని దీవిస్తూ "వద్దమ్మా వద్దు పెద్ద వాళ్ళకి చెప్పకుండా యివ్వకూడదు. తప్పు. మీ బామ్మొచ్చేక అడిగే యిద్దువుగాని. ఆవిడేనా వద్దనదు. ఎక్కడ తీసేవో మళ్ళా అక్కడే పెట్టే" అని రూపాయి పుచ్చుకోకుండా పెట్టేసింది ముసలమ్మ.

"తీసుకోండి. మరేం తఖ్లేదు" అన్నాను.

"నీకు తెలీదమ్మా" అన్నా దావిడ. రామారావు తమ్ముడిచ్చిన చొక్కా లాగునీ కింద పరిచి జాగ్రత్తగా మడత పెట్టుకున్నాడు. అవి కూడా పుచ్చుకోవడమా మానీడమా అని సంకోచంతో భయపడుతూ ముసలమ్మ పక్క చూసేడు.

"వాటికేం ఫర్వాలేదు. అవి నేనిచ్చేను తీసుకో" అని ధైర్యంగా చెప్పేడు తమ్ముడు.

"మళ్ళా వస్తాం నాయినా మీ వాళ్లతో చెప్పేయిద్దువుగాని" అన్నాది ముసలమ్మ. రామారావు పక్కనున్న కర్ర తీసేడు. ముసలమ్మ పెద్ద ప్రయత్నంతో లేచి నిల్చుని కర్ర పుచ్చుకుంది. రామారావుకి బట్టలు వది లేసి వెళ్లడం యిష్టంగా లేదు. వాటిమీంచి వాడు దృష్టి మరల్చలేకుండా ఉన్నాడు. ముసలమ్మ మాత్రం వొణుకుతున్న కాళ్ళూ చేతుల్తోటి కర్రని తణువుకు వేసుకుంటూ గడపదాటి వెళ్లిపోతున్నాది.

"ఇక్కడే కూర్చోకూడదా?" అన్నాడు రామారావు.

"ఈ పక్కనే మా లక్షుమ్మ గారింటికెళ్లి మళ్లా వద్దాం" అన్నాది ముసలమ్మ.

"వెళ్ళండి వెళ్లండి మా లక్షుమ్మగారు బాగా యిస్తారు" అని పళ్లు కొరుక్కుంది అక్కయ్య. ముసలమ్మ వీధి గుమ్మంలోకి వెళ్లిపోయింది గాని రామారావు మాత్రం జాలిగా వెనక్కి తిరిగి చొక్కా లాగూ వేపు మరోసారి చూసుకున్నాడు.

"ఆ పక్క గదిలో ఆయన ఎవరితోటీ మాట్లాడుతున్నాడు?"

"అబ్బే ఎవరూ లేరు. తనతో తనే."

"అయితే ఆ గావుకేకలెందుకు?"

"ఆయనికి బ్రహ్మ చెముడు."

"ఒరేయి రామారావ్ యిలారా" అని మెల్లిగా పిల్చేడు తమ్ముడు.

"ఈ చొక్కా లాగూ, రూపాయి తీసుకుపో. మా వాళ్లతో మేం చెప్పకుంటాంలే. మళ్లా ఎన్ని సార్లు తిరిగి చస్తావు. పో" అని తమ్ముడు చొక్కా లాగూ, రూపాయి కూడా వాడి చేతికిచ్చేసేడు. చొక్కా లాగూ చంకలో పెట్టేసుకుని పిడికిట్లో గట్టిగా రూపాయి పట్టుకుని రామారావు ఎక్కడివాడక్కడే నిల్చుండిపోయేడు. పుచ్చుకోవడమో మానడమో వాడికింకా సందేహంగానే ఉంది.

"పట్టుకు పొమ్మన్నానా? నాతో మాటంటే అంతే. పట్టుకుపో. చిన్న జెల్లకాయ మాత్రం యిచ్చుకో." అని వాడి నెత్తిమీద చిన్న జెల్లకాయ కొట్టి గెంటేసేడు తమ్ముడు. రామారావు అవి పట్టుకుని ముసలమ్మ వెనకాతల పరిగెట్టేడు.

మరో అరగంట కల్లా, "అమ్మయ్య ఏం జనం, ఏం జనం" అంటూ వచ్చిందమ్మ. చేతిలో కొబ్బరికాయ చెక్కా, చెక్క నిండా పత్రీ పువ్వులూ, కుంకం పొట్లాం పట్టుకుని. కోతిలా అమ్మ చేతిలో ఉన్న కొబ్బరికాయి చెక్క లాక్కున్నాడు తమ్ముడు.

"ఉండరా కొట్టి తలో ముక్క యిస్తాను" అంది అమ్మ.

"గర్భ గుడిలో ఊపిరాడేలేదు. ఏం తోపుళ్లు ఎంతో పుళ్ళు. దర్శనం అవడమే కష్టమైపోయింది. ఇవతల కొచ్చేసరికి ఈగల్లా చుట్టుకున్నారా ముష్టి వెధవలు. వాళ్లని తప్పుకొచ్చేసరికి తల ప్రాణం తోకొచ్చింది. హుస్సు. హా పరమేశ్వరా" అంటూ బామ్మ చతికిల్లా పడ్డాది. దభీదభీమని కొబ్బరికాయి చెక్కని నేలనేసి కొట్టి తింపం మొదలెట్టేడు తమ్ముడు.

"అంతా నువ్వు తినీడం కాదు. ఆ ముక్క యిలా యిచ్చెయ్యి" అన్నా దక్కయ్య.

"నీలా అనుకున్నావేమిటి? మీరూ తినండి" అని చెక్క విసిరేసేడు తమ్ముడు.

"అవును నీకు ధర్మబుద్ధి చాలా పెరిగి పోయింద"న్నాడక్కయ్య. అక్కయ్య కొబ్బరి ముక్క ప్రసాదం తిని అమ్మ దగ్గిరున్న పువ్వుల్ని కళ్ళద్దుకుని తల్లో పెట్టుకుంది. కుంకం తీసుకుని బొట్టు పెట్టుకుంది.

"నువ్వూ పెట్టుకోవే" అని నాకూ పువ్విచ్చిందమ్మ.

"వాడూ చిన్నదీ నీ మొఖణ్ణి పుణికి పుచ్చుకున్నారు. కేవుడ నేసరికి మీద పడ్తారు. వాడి చెవులోనూ ఓ పువ్వు పెట్టు" అంది బామ్మ.

"పెట్టుకుంటాను బామ్మా పెట్టుకుంటాను" అని తమ్ముడు చెవులో పువ్వు పెట్టుకున్నాడు.

"ఏం యివాళ అంత బుద్ధొచ్చింది?" అడిగింది బామ్మ.

"బుద్ధే ఈ వెధవేమొ..." అని ప్రారంభించి ముసలమ్మ రావడం, ఆవిడ కబుర్లూ, చొక్కాలాగూ యిచ్చిన సంగతీ చెప్పేసిందక్కయ్య.

"అయ్యో అయ్యో, ఏ చొక్కాలాగేవ్?" అమ్మ అడిగింది.

"నిరుడు పుట్టిన రోజుకి కుట్టించిన జత. చిరుగు పట్టడానికి సిద్ధంగా నే ఉన్నాయి" అన్నాడు తమ్ముడు.

"చిరుగు పట్టడానికి సిద్ధంగా ఉన్నాయా? ఏం మాట్రా నాయినా, నిక్షేపంలాంటి బట్టలు. ఎవడ్రా యిమ్మన్నాడూ? నీకేం పోయికాలంరా? తిన్నగా ఉండలేవూ? ఇదెక్కడి పిల్లర్రా బాబూ" అని నెత్తీ నోరూ కొట్టుకుందమ్మ.

"అవేం నిక్షేపంలా లేవు. రెండూ పొట్టయిపోయేయి. నేనవి కట్టుకుని బళ్ళో కెళ్ళడమే లేదు. ఏడాదైపోయింది. మరో పుట్టిన రోజు వెళ్ళిపోయింది. అందుకే యిచ్చేసేను. ఆ మాత్రం నాకూ తెల్సు" అన్నాడు తమ్ముడు.

"తెల్సు తెల్సులోడి తెలుసులేవు. నీకన్నీ తెల్సు. వెధవ కానా, ఎందుకురా యిచ్చేవు? ఓ ఘడియ యింట్లో ఉంచితే మంచిపనే చేసేరు. ఏమేఁ, నీ బుద్ధేమైపోయిందే? ఆ వెధవిస్తే చూస్తూ ఊరుకుంటావా? పెద్ద దానివి కదా? ఆ మాత్రం తెలియొద్దూ?" అని బామ్మ అక్కయ్య మీద లేచింది.

"బాగానే ఉంది. నేనేం చేస్తాను? వాళ్ళు నా మాట వింటేనా? ఇయ్యరా తమ్ముడూ అని అందీ, అవునే చిన్నక్కా అని వాడూ యిచ్చేసేరు. నేనొద్దంటే నా మీద కఁయ్యిఁమన్నారు. అక్కడితో వదిలిందీ? నువ్వు భాగవతంలో పెట్టుకున్న డబ్బుల్లోంచి ఓ రూపాయీ యిచ్చేసేరు" అన్నాదక్కయ్య.

"ఆఁ ఆఁ మీ నెత్తి వాయించా. నా డబ్బు లెందుకు ముట్టుకున్నార్రా. అందులో మూడు రూపాయిల చిల్లరుండాలి. గుంటలూ గుంటందాలూ లేవు. ఆ డబ్బుతో సహస్రాభిషేకం చేయిద్దామనుకున్నాను. ఎవత్రా ఆ ముసిలిముండ? దాని ఎదాన్ని పోసేసేరా?" బామ్మ తమ్ముడి మీదకీ నా మీదకీ వచ్చి చేతులాడిస్తూ దెబ్బలాడ్డం మొదలెట్టింది.

"ఆవిణ్ణి ముండని తిడుతున్నావేమిటి? నీ స్నేహితురాలే. మూడు కోవిళ్ళలో మీ యిద్దరూ ఒక దగ్గిరే కూర్చుని పురాణం వింటారుటా. ఆవిడే చెప్పింది. నువ్వు పెద్ద జ్ఞానివని కూడా చెప్పింది" అన్నాను.

"ఒక్క రూపాయే యిచ్చేం. కావలిస్తే చూసుకో. నువ్వే ఉంటే ఆ మూడు రూపాయిలూ యిచ్చే దానివే. మేం యిచ్చేం కాబట్టి ఇలా అంటున్నావు" అన్నాడు తమ్ముడు.

"ఏడిసినట్టే ఉంది. ఆ ముండ నా స్నేహితురాలేవిఁటి? ఏదో కోవిల్లో కనపడి దాని గోడూ అదీ చెప్పుకుని ఏడ్చింది. అలాగా పాపం అన్నాను. అంతే. అలా అని దానికి దానం చేస్తానా? యిస్తే వేడో పావలో యిస్తాం కాని రూపాయిలూ బట్టలూ యిచ్చేసుకుంటామా? దిక్కుమాలినవాళ్ళెంతమంది లేరు? అయినా మీకిలాంటి బుద్ధులు పుడ్తున్నాయేమర్రా? మీ నాన్న రానీ. తొక్క వొలిపించేస్తాను. నా డబ్బు తిసీసేరు. మళ్ళా వాడు నా కిస్తాడా?" బామ్మ పెద్ద గొంతుకతో అరవడం మొదలెట్టింది.

"ఈ పిల్లలతో నే వేగలేకుండా ఉన్నానమ్మా. ఒక్క క్షణం గడపదాటితే యిల్లు తీసి పందిరేస్తారు. వెళ్ళేటప్పుడు జాగ్రత్త్రోయి అని చెప్పే వెళ్ళేను. అన్నీ వెధవ పనులే. ఆయన రానీండి. వెధవలని ఉతికింపించేస్తాను" అన్నాదమ్మ.

"పాపం ఆ ముసలమ్మ మంచిదే. తప్పమ్మా పెద్దవాళ్ళకి తెలీకుండా యివ్వకూడదు. మళ్ళా వస్తాంలే అని వదిలేసి వెళ్ళిపోయింది. ఈ వెధవ ఆ కుర్రాడి చేతిలో పెట్టి తీసుకుపో. మా వాళ్ళేమీ అ(ను అని యిచ్చి మరీ పంపించేడు" చెప్పిందక్కయ్య.

"అదోటా? ఆవిడ పుచ్చుకోకపోయినా యిచ్చీసేడు?" అని నోరెళ్ళబెట్టింది అమ్మ.

"వాడి పేరు తాతయ్యదిటా నువ్వేమీ అనవుట. అంచేత మరేం ఫర్వాలేదన్నాడు"

"పేరు తాతయ్యదైతే ఆ గుణాలు వీడికెక్కడున్నాయి? ఈ వెధవ ఆయన పేరూ ప్రతిష్టా నిలబెట్టి అంతటివాడైతే యిహానే కావాలి" అన్నాది బామ్మ.

"నన్ను తిట్టినప్పుడల్లా తాతయ్యని తిట్టినట్టేలే" అన్నాడు తమ్ముడు.

"ఓరి చచ్చినాడా, నీగుండు బద్దలు కొడతానుండు. మీ అమ్మ అడ్డుపడుతుందనుకుంటున్నావు గాబోలు" అని తమ్ముణ్ణి పట్టుకోబోయింది బామ్మ. తమ్ముడు ఆవిడకి అందకుండా మండువాలోకి పరిగెట్టేడు.

"నీకడ్డలంటే యిచ్చుకున్నావు. ఆవిడ రూపాయెందుకు తీసేవురా? నీ కెన్నిసార్లు చెప్పేను? ఆవిడ జోలికెళ్ళొద్దనీ, ఆవిడ వస్తువులు ముట్టుకోనద్దనీ. ఎంత చెప్పినా బుద్ధి లేదు వెధవకి" అని గబగబా లోపలకెళ్ళి భాగవతం తీసుకొచ్చిందమ్మ.

"చూసుకోండి ఎంత తీసేసేడో?" అన్నాది.

"చూసుకోండి. మేమేం ఎక్కువ తీసుకోలేదు" అన్నాను.

"వాడు రానీ. అంతా చెప్పి వెధవని చీరింపించేస్తాను" అని చిందులు తొక్కింది బామ్మ.



# బామ్మ రూపాయి



"శివరాత్రిపూటా ఓ రూపాయి బీద కుర్రాడికిస్తే నన్నడ్డమైన తిట్లూ తిట్టేరని నేనూ నాన్నతో చెప్తాను" అన్నాడు తమ్ముడు!

"నోరుముయ్యి వెధవా దేనికైనా ఓ సబబూ సందర్భమూ ఉండాలి" అన్నాది అమ్మ. అమ్మ అంటున్నాది ఇంతట్లో నాన్నొచ్చేసేడు.

"త్వరగా వడ్డించెయ్యండి. ఆఫీసుకు పోవాలి" అని గబ గబా గదిలోకి పోయేడు.

"అదేం వెధవా ఫీసో శివరాత్రిపూటా ఆఫీసే." అన్నాదమ్మ.

"నువ్వింట్లో లేకపోతే నీ పిల్లల ఆగడం యింతా అంతా కాదు. నా రూపాయి నాకిచ్చేసి నీ పిల్లలకేంబుద్ధి చెప్పుకుంటావో చెప్పుకో" అని గది గుమ్మంలో కెళ్లి పెద్ద గొంతుకతో చెప్పింది బామ్మ.

"దాని రూపా యెందుకు తీసేర్రా? దాంది దానికిచ్చెయండి" అని తాపీగా అన్నాడు నాన్న.

"ఇహ నెక్కడ రూపాయి? నీకొడుకు ప్రయోజకత్వం, నీచిన్న కూతురు ప్రయోజకత్వం" అని మొదలెట్టింది బామ్మ.

"నువ్వేం చెప్పనక్కర్లేదు. నేనే చెపుతాను" అని బామ్మ కడ్డంపడి తమ్ముడే అంతా చెప్పేసేడు.

"అయితే యింతకీ వీడు బట్టలూ రూపాయీ యిచ్చేసేడంటావా?" అంతా విని తాపీగా అడిగేడు నాన్న.

"ఏం బాగుందిరా? ఇచ్చేసేడంటావా అని మెల్లిగా అడుగుతున్నావా? వెధవని పట్టుకు తన్నక. దానీ వాడి గుడ్డలంటే యిమ్మనుకున్నాడు. నా రూపా యెందుకు తీసేడో గట్టిగా అడుగు. పైపెచ్చు ఆ ముండ నా స్నేహితురాలంటాడు" అంది బామ్మ.

"నిక్షేపంలాంటి బట్టలు. ఆ వెధవకిచ్చేసేడు. వీడికి మా దగ్గిర బొత్తిగా భయం లేదు" అంది అమ్మ.

"రెండూ పొట్టైపోయేయని చెప్పేనా! ఎన్నిసార్లు చెప్పాలి?" అన్నాడు తమ్ముడు.

"మావాళ్లులేరు. వచ్చేకరండి అని చెప్పవలసింది పోయింది వాళ్లకి దానాలుచేసేరు దానాలు. చేస్తే చేసేరనుకో దానికి అణావా బేడా? రూపాయికి రూపాయీ యిచ్చేసేరు" అన్నాది బామ్మ.

"ఇస్తే ఏం? నువ్వు కోవిల్లో ఖర్చుపెట్టలేదూ?" అన్నాడు తమ్ముడు.

"ఒరేయి నువ్విలా ఊరుకోడంనించే నీ పిల్లలిలా నెత్తెక్కుతున్నారు. నా కదంతా తెలీదు. నా రూపాయి నాకిచ్చెయ్యి" అన్నాది బామ్మ.

"నీ డబ్బులు నువ్వు భాగవతంలో పెట్టుకున్నావా? అందులోది వాడు రూపాయి తీసేసేడూ? వాడితో చదువుకుంటున్న కుర్రాడైనా కాదూ? హైస్కూల్లో చదువుతున్నాడా?" అని నాన్న ఇచ్చినందుకు కోపం వచ్చిందో రాలేదో తెలీకండా అన్నాడు.

ఆ కంఠస్వరానిబట్టి "వీళ్లకి బాగా పెళ్ళి కావాలి" అని అక్కయ్య మరో పుల్ల ఎగసన దోసింది.

"రామ రామ. ఆ కుర్రాడికి తల్లీ తండ్రీ చచ్చిపోయేరు. వాళ్ల బామ్మ అతుక్కుని చదువు చెప్పిస్తున్నాది. నే నా కుర్రాణ్ణి బాగా ఎరుగుదును నాన్నా. వాళ్ళకో రూపాయీనూ పొట్టైపోయిన గుడ్డలూయిస్తే తప్పా? మొన్న పుట్టినరోజుకికాక అంతకు ముందు పుట్టినరోజుకి నువ్వు కుట్టించేవు. చిరుగుపట్టలేదు కాని ఇరుకైపోయేయి. శివరాత్రిపూటా దేవాలయానికెళ్ళి వాళ్లు డబ్బు తగలెయ్యొచ్చు కాని నేనో రూపాయి దానంచేస్తే తప్పా" అన్నాడు తమ్ముడు.

"అయ్యో అయ్యో! దేవాలయంలో తగలెయ్యడం ఏమిట్రా. నోటికొచ్చినట్టు పేల్తున్నావ్. దైవభక్తి పాపభీతి లేకపోతే పశువ్వవుతావు" అన్నాదమ్మ.

"బాగానే ఉంది యిన్నేళ్ళొచ్చాక నీ కొడుకు నాకు నీతులు చెపుతున్నాడు" అన్నాది బామ్మ. నాన్నేమిటంటాడో అని నాన్నొచ్చిం దగ్గర్నించి ఓ మూల నాకు భయంగానే ఉంది.

"పెద్దవాళ్లకి చెప్పకుండా చెయ్యకుండా అలా యివ్వొచ్చునా" అని మందలిస్తూ అన్నాడు నాన్న. టక్కు టక్కు కర్ర చప్పుడు చేసుకుంటూ సమయానికి మళ్లా దిగబడ్డాది ముసలమ్మ. రామారావు మాత్రం ముసలమ్మ వెనక రాలేదు.

"ఈ ముసలమ్మే. మళ్ళా వస్తున్నాది. పుచ్చుకున్నది చాల్లేదు కాబోలు" అన్నాదక్కయ్య.

"ఓసారి దయతలిస్తే యిల్లు గుల్లచేసేస్తారు" అన్నాదమ్మ.

"అక్కగారూ గుడినుంచి వచ్చేసేరూ? దేవుడి దర్శనం అయిందా? చిన్న పొరపాటు జరిగింది. పసిపిల్లల కేం తెలుస్తుందీ? మీరు లేనప్పుడొచ్చేను. మీ పిల్లలు మావాడికి బట్టలూ రూపాయీ యిచ్చేరు. నేను మళ్లా వస్తానని చెప్పివెళ్ళిపోతే మాగుంట వెధవ యిచ్చేరని సంబరంతో నా వెనకాతల పుచ్చుకున్నాడు. మీ చేతుల్లో యిస్తే పుచ్చుకోవాలి కాని పిల్లలిస్తే ఎలాగా? ఇవాళిదైంది రేపు యింకోటవుతుంది" అని ముసలమ్మ గుడ్డలూ రూపాయి పదిలంగా అరుగుమీద పెట్టేసింది.

"అక్కగారూ నా స్థితి గతులన్నీ మీరు బాగా ఎరుగుదురు. మీకు దేవుడు ఏం

(56-వ పేజీ చూడండి)

## ఆత్మకథ

కవి: పతా వాతా చెప్పొచ్చిం దేమిటంటే, నేనసలు కవిత్వం రాయడానికి పనికిరానని, గట్టిగా తెలుసుకోడానికి పదేళ్లు పట్టిందన్నమాట!

శ్రోత: తెలుసుకోగానే రాయడం మానేశారాండి?

కవి: అబ్బే. అప్పటికే చాలా ఆలస్యం అయిపోయింది. సుప్రసిద్ధ కవుల జాబితాలో చేరిపోయాను.



కొలంబియా పిక్చర్సువారి క్రొత్తతార కేథరిన్ గ్రాంట్.



ఓ. పి. ప్రొడక్షన్స్ హిందీచిత్రం 'టిక్ ఖాయ్'లో భరత్ భూషణ్, శ్యామ.



అమెరికన్ చిత్రం ఫాబ్యులస్ సినోరిటాను అనుసరించి గోయెల్ ప్రొడక్షన్స్ నిర్మించిన
హిందీచిత్రం 'అల్బేలీ'లో అల్లరిపిల్ల గీతాబాలి.



కొదమలు  చిత్రకారుడు: ఎస్. మునుస్వామి

గోకుల్ పిక్చర్స్ "కనకతార" లో ఎస్ వరలక్ష్మి





ప్రతిభావారి
'ఏదినిజం?' లో
వంగర,
రాఘునాథశాస్త్రి,
గుమ్మడి.



కిస్మత్ ఆధారంగా నరసూ పిక్చర్స్ నిర్మిస్తూన్న చిత్రంలో నాయకీ నాయికులు, నాగేశ్వరరావు, సావిత్రి.



ఫిలింస్థాన్ సినిమాస్కోప్ ఆంగ్ల చిత్రంలో నటించిన వివిశాబట్, ఆమెభర్త జిమ్మి వైనింగ్. ఈ జంట వివాహం జరిగి వంద రోజులు అయింది అందుకని, ఒక శతదినోత్సవంజరిపి, మిత్రులకు విందు చేశా.రు



బాంబేటాకీస్ వారి కిస్మత్ ఆధారంగా నరసూపిక్చర్స్ నిర్మిస్తున్న చిత్రంలో గిరిజ, చలం.

# బొంబాయి సినిమా లేఖ

మహాపురుషుల భూమికలు నిర్వహించి సర్వేసర్వత్రా ఆదరాభిమాన పాత్రుడైన భరత్ భూషణ్, మహాకవి కాళిదాసుగా నటించబోతున్నారు. ఫిలింస్తాన్ వారు ఈ చిత్రాన్ని వర్ణచిత్రంగా నిర్మిస్తారు. ఇందులో భరత్ కు నాయకగా నటించేది - సుప్రసిద్ధ బెంగాలీనటి సుచిత్రాసేన్

మహాపురుషుల భూమికలు నిర్వహించడంలో భరత్ అటు సంఖ్యలలోను, ఇటు ప్రతిభలోనూ కూడా అగ్రతాంబూలం అందుకున్నాడనవచ్చు. భక్తకబీర్, బైజుబావ్రా, చైతన్య మహాప్రభు, మీర్జాగాలిబ్ మొదలైనవన్నీ దేశవ్యాప్తంగా భరత్ ను అభిమాన పాత్రుణ్ణి చేశాయి. మీర్జాగాలిబ్ చిత్రానికి రాష్ట్రపతి సువర్ణపతకం కూడా వచ్చింది

అయితే, ఒక బైబిల్ కథ, ఒక బౌద్ధమత గాథ ఇతి వృత్తాలుగల చిత్రాలలో నటించాలని భరత్ సంకల్పం. భరత్ వంటి స్థితప్రజ్ఞుడికి ఇటువంటి సంకల్పం ఉంటే, డబ్బు పెట్టి దాన్ని కార్యరూపంలో పెట్టబోవడం, వ్యాపార దృష్ట్యా లాభసాటి కాగలదని చాల మందికి తెలుసు. ఫిలింస్తాన్ వారికీ తెలుసు. అందుకే, ఫిలింస్తాన్ తమ వర్ణ చిత్రంలో భరత్ భూషణ్ ను తీసుకున్నారు.

ఏదెలా ఉన్నా, భరత్ భూషణ్ పట్ల అభిమానం, గౌరవం ఉన్న చాలమంది, భరత్ నిర్వహించే భూమికలమాటకన్నా, అతడి పెళ్లి పట్ల చాలా శ్రద్ధా సక్తులు చూపుతున్నారు. రోజూ భరత్ కు ఎన్నో ఉత్తరాలు వస్తూ ఉంటాయి భరత్ మళ్ళా పెళ్ళి చేసుకుంటాడా? చేసుకుంటే, ఫిలిం పరిశ్రమలో వారెవరినైనా వరిస్తాడా? లేకపోతే మామూలు వారిని చేసుకుంటాడా? అంటూ ఆ ఉత్తరాలు అనేక ప్రశ్నలను పట్టుకొస్తాయి.

నిజానికి భరత్ ఊహలు ఈ పంథాలో లేవు. తన మొదటిభార్య సరళను మూమూర్తులా పోలినయువతి కనబడేవరకూ వివాహం చేసుకోకూడదని గట్టిగా నిశ్చయించుకున్నాడు. ముక్కు మొహం అలాగే ఉండకపోయినా, తీరూ తెన్నూలలోనూ, ఊహాపోహాలలోను అయినా సామ్యం ఉండాలని భరత్ అభిలషిస్తున్నాడు.

* * *

మెహబూబ్ ప్రొడక్షన్సు "అవాజ్" షూటింగ్ అర్ధాల్లు సాగి ఆమధ్య ఆగిపోయింది రెండు మాసాలక్రితం ఈ చిత్రంలో చాలా మార్పులుచేశారు. మార్పులలోకల్లా పెద్దమార్పు సారథ్యం. మొదట నియుక్తుడయిన దర్శకుడు జియాసర్హాదీ తప్పుకున్నారు ఇప్పుడు నిర్మాత మెహబూబ్ స్వయంగా ఆ బాధ్యత నిర్వహిస్తున్నారు.

* * *

షాహీమిస్త్రీ చిత్రం "తాజ్"కు కూడా దర్శకత్వం చేతులుమారింది. వైజయంతిమాల నటిస్తున్న ఈ చిత్రానికి మొదటినుండీ దర్శకుడుగా ఉన్న నందలాల్ జస్వంతలాల్ స్థానే, వయోవృద్ధుడు దాదా గుంజల్ నియుక్తుడయ్యారు. ★

[ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి]



తారలు నళినీజయవంత్, ఉషాకిరణ్.

# సినిమా వార్తలు

## ఫిలింస్థాన్ వర్ణచిత్రం పేరు మార్పు

ఫిలింస్థాన్ ఆంగ్లంలో నిర్మించిన సినిమా స్కోప్ వర్ణచిత్రం "త్రీ హి డెడ్ కోబ్రా" త్వరలోనే విడుదల కాబోతున్నది. దీనికి ఈ పేరు తొలగించి, మొట్టమొదట పెట్టిన పేరు 'బాంబే ఫ్లైట్ 417' అన్న పేరునే ఖాయపరచారు. ఈ చిత్రంలో తెలుగుతార సూర్యకుమారి, వినితా బట్, అశోక్ కుమార్, ప్రేమనాథ్, అలెక్సాండి అర్కీ, జాన్‌లోడర్లు నటించారు. ఫిలింస్థాన్ అధిపతి తులారాం జాలాన్ ఈ చిత్రం విడుదలకు సన్నాహాలు చేసేనిమిత్తం మొన్ననే లండన్ వెళ్ళి ఉన్నారు.

## హెమింగ్‌వే నవల చిత్రణ

ప్రసిద్ధ నవలా రచయిత ఎర్నెస్ట్ హెమింగ్‌వే నవల "దిసన్ ఆల్సో రైజెస్"ను చలనచిత్రంగా తీయాలని అమెరికన్ ఫిలిం సంస్థ ట్వంటీయత్ సెంచరీఫాక్స్ సంకల్పించారు దీన్ని హెమింగ్‌వే 1926 ప్రాంతాలలో వ్రాశాడు ఫాక్స్ సంస్థ పేరిట డారిల్ ఎఫ్. జనూక్ నిర్మించే ఈ చిత్రానికి హోవర్డ్ హాక్స్ దర్శకత్వం వహిస్తాడు.

* * *

హాలీవుడ్ బాక్సాఫీస్ నటుడు గ్రెగరీ పెక్, డిసెంబరు ఆఖరు వారంలో, వెరోనిక్ పసానీ అనే ఫ్రెంచి వనితను వివాహం చేసుకున్నాడు. ఈమె జర్నలిస్టు.

* * *

## దొంగరాముడు శతదినోత్సవాలు

అన్నపూర్ణా పిక్చర్స్ నిర్మించిన 'దొంగ రాముడు' చిత్రం ఈ నెల 8 వ తేదీన విజయవాడ,గుంటూరులలో శతదినోత్సవాలు చేసుకున్నది. విజయవాడ మారుతీ హాలులో జరిగిన శతదినోత్సవ సభకు శ్రీ కాజ వెంకట రామయ్య అధ్యక్షత వహించారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ప్రభృతులు మాట్లాడుతూ చిత్రాన్ని ప్రశంసించారు. ఈ ఉత్సవాలను పురస్కరించుకొని, దర్శకుడు శ్రీ కె. వి. రెడ్డి, సంగీత దర్శకుడు శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు, కళాదర్శకుడు శ్రీ కృష్ణరావు, కవి శ్రీ సముద్రాల రాఘవాచార్యులు, నటీనటులు శ్రీయుతులు నాగేశ్వరరావు, జగ్గయ్య, రేలంగి వెంకటరామయ్య, రామన్న పంతులు, శ్రీమతులు సావిత్రి, జమున ప్రభృతులు విజయవాడ వెళ్లారు. శత దినోత్సవ సభలో ఈ కళాకారుల బృందానికి సన్మానం జరిగింది. చిత్రాన్ని విడుదల చేసిన నవయుగ పిక్చర్స్ ఆ రోజునే నటీనటుల, దర్శకుల గౌరవార్థం తేనీటివిందు చేశారు.



ఎ. వి. ఎం. వారి 'భాయ్‌భాయ్'లో నిమ్మీ.

## పెంకిపిల్ల, మంకు పట్టూ

అల్లారు ముద్దుగా పిల్లల్ని పెంచుకోవడం అంటే, వాళ్ళ అల్లరి సహించి ఊరుకోవడం.

సేఠ్ గిరిధరలాల్ తన ఒక్కగా నొక్క కూతుర్ని అల్లారు ముద్దుగానే పెంచాడు. పెంకితనంచూసి ముచ్చట పడ్డాడు కూడా. తను అన్న ప్రతిమాట చెల్లడం ఆ పిల్లకు పరిపాటి అయిపోయింది ఈ సత్సంప్రదాయం నిరాఘాటంగా సాగిపోయేదే కాని, గారాబు కూతురు తన జీవిత భాగస్వామిని ఏరుకోవడం తండ్రికి నచ్చలేదు. కూతురును వలచి వలపించుకున్న 'డాన్‌వాన్' ధోరణి గిట్టలేదు. అల్లుడవుతానని బెదిరిస్తున్న 'ఆ డాన్‌వాన్ సేఠ్ గిరిధరలాల్ అంచనాలో కేవలం 'రోడ్డు గోల్డు' అసామిగా తేలాడు. 'అమ్మాయీ వీడు మంచి వాడు కాడు' అంటే వినే ధోరణిలో లేదు కూతురు. అందుకని దేశాటనం చేదాంపదమని ప్రయాణం కట్టించాడు ఓడ మీద. ఆ ఓడలో, గిరిధరలాల్ కూతురుచేసిన అల్లరి ఆర్భాటం ఇంతా అంతా కాదు.

అల్లరి చేస్తేనేం, మెత్తానికి "ఆ టోకరా కుర్రాణ్ణి" మర్చిపోతుందని ఆశపడ్డాడు గిరిధరలాల్. ఆ పైన ఓ బంగారు తండ్రిని తెచ్చి పెళ్లి చేయవచ్చునని తలచాడు. కూతురు మాత్రం తను వరించిన 'సుమంత్' నే పెళ్ళి చేసుకోవాలని తలచింది. చివరికి దర్శకుడు అనంత ఠాకూర్ సంకల్పం ఏమిటో వెండి తెరమీద తేలాలి కాని, మొన్నటి షూటింగ్‌లో మాత్రం, అల్లరిపిల్ల, తండ్రి కన్ను మరగేసి, ఓడ దిగి ఉడాయించింది.

అనంత ఠాకూర్ దర్శకత్వాన ఎ.వి.ఎం. వారు నిర్మిస్తున్న 'చోరి చోరీ' లో ఒక ఘట్టం ఇది. ఈ ఓడలోపలి భాగం స్టుడియోలోనే కట్టారు. అల్లరిపిల్ల కమ్మొగా నర్గీస్, ఆమె తండ్రి సేఠ్‌జీగా గోప్, ఇందులో నటించారు. ఇందులో డాన్‌వాన్ రాజ్‌కపూర్. ప్రాణ్, భగవాన్, జానీ వాకర్, ఇతర నటులు. ఈ చిత్రానికి శంకర్ జైకిషన్‌లు సంగీతం సమకూర్చారు.



ఆంధ్రాసిస్టర్స (బందరు) విజయ, మారుతి ల శివ-పార్వతి నృత్యభంగిమ.

## నరసూ వారి 'కిస్మత్'

బాంబేటాకీస్ వారి "కిస్మత్" ఆధారంగా నరసూవారు నిర్మిస్తున్న కొత్తచిత్రాన్ని ఫిబ్రవరిలోవిడుదలచేయడానికి నిర్మాత శ్రీనరసూ గారు సన్నాహాలు చేస్తున్నారు. ఈ చిత్రానికి ఇంకా పేరు పెట్టలేదని అయన చెప్పారు. వేదాంతం రాఘవయ్య ధర్శకత్వాన తయారవుతున్న ఈ చిత్రంలో సావిత్రి, నాగేశ్వరరావు, గిరిజ, రేలంగి, సీత, చలం, గుమ్మడి, సి. ఎస్. ఆర్. పేకేటి ప్రభృతులు నటిస్తున్నారు. సంగీత దర్శకుడు శ్రీ ఎస్. రాజేశ్వరరావు.

నరసు అధిపతి శ్రీ వి. ఎల్. నరసు గారు ఇప్పుడు ఒక హిందీచిత్రం నిర్మింప నిశ్చయించారు. ఈ చిత్రంలో తొలిసారిగా అశోక్‌కుమార్, వైజయంతిమాల కలసి నటిస్తారు. దీనికి "సితారోం సే ఆగే" అని పేరుపెట్టారు. శ్రీ గ్యాన్‌ముఖర్జీ దర్శకత్వం వహిస్తున్నారు శచిన్‌దేవ్ బర్మన్ సంగీతం సమకూరుస్తారు. ఫిబ్రవరి రెండో వారం నాటికి సెట్స్ మీదకు వెళ్తారని తెలుస్తున్నది.

* * *

ఫిలింస్థాన్ చిత్రం 'జాగృతి'ని కొన్ని దేశాలనుంచి అనేక బేరాలు వస్తున్నాయి. డెన్మార్కు ప్రభుత్వం అపుడే, ఒక ప్రతిని కొన్నది కూడా. ఈ చిత్రాన్ని డేనిష్ భాషలోకి డబ్ చేసి, అక్కడ దేశవ్యాప్తంగా పాఠశాలలలో ప్రదర్శించాలని ఆ ప్రభుత్వం సంకల్పించిందట.

## కొత్తరకం జంట

ఇక వెండితెరమీద కొత్తరకంజంట కనబడుతుంది. ఈ జంటలో హీరో హీరోయిన్‌లు వుండరు. అనగనగా రోజులనుంచి ఈనాటివరకూ వెండితెరమీద హీరోగా వెలుగుతూ, అభిమానాలు చూరగొం

టున్న అశోక్‌కుమార్, అతురాలా అతగాడి వెంట వుండే 'రూప్‌కుమార్'ల జంట 'బందీష్'లో పరిచయం అయింది.

అబ్బాయిపేరు పెట్టుకుని, అబ్బాయి వేషంతో, 'బందీష్'లో ముచ్చటగా నటించిన 'టూమాటో' అసలు పేరు దీసే ఇరానీ. అశోక్‌కుమార్ కోటు పట్టుకు తిరగడం ఈ ఐదేళ్ల 'నటీమణికి' బాగా అలవాటైపోయింది. ఇప్పుడు ఈ కొత్తరకం జంట నటిస్తున్న కొత్తచిత్రాలు ఏక్ హీ రాస్తా, భాయ్ భాయ్, దువా. నవ్వుతూ నవ్విస్తూ వుండే ఈ కొత్తరకం జంటతో వెండితెర కలకలలాడగలదని ఆశించవచ్చు.

## జూపిటర్ ఉమాసుందరి

జూపిటర్ పిక్చర్స్ రెండవ తెలుగు చిత్రం "ఉమాసుందరి" నిర్మాణం నెప్ట్యూన్‌లో చురుకుగా సాగుతున్నది. మార్చి రెండవ వారానికి విడుదల చేయాలనుకుంటున్నారు. ఎన్. టి. రామారావు, శ్రీరంజని, నాగయ్య, కన్నాంబ, రేలంగి, సురభి బాలసరస్వతి, వంగర, పేకేటి మొదలగువారు నటిస్తున్న ఈ చిత్రానికి లంక సత్యం దర్శకుడు. పర్యవేక్షణ పి. పుల్లయ్య. నల్లతంగాళ్ అనే తమిళ చిత్రం ఆధారంగా నిర్మిస్తున్న ఈ చిత్రానికి మాటలూ పాటలు సదాశివబ్రహ్మం వ్రాశారు.

## లక్ష్మీ ప్రొడక్షన్స్ నెం. 1

లక్ష్మీప్రొడక్షన్స్ నిర్మిస్తున్న సాంఘిక చిత్రంలో అంజలీ నాగేశ్వరరావులు ప్రధాన భూమికలు నిర్వహిస్తారు. మరొక ముఖ్య భూమికకు మొన్న నేజమునను తీసుకొన్నారు. ఈ పాత్రల ప్రమేయం లేని సన్నివేశాలన్నీ దాదాపు పూర్తిఅయినట్లే. వాటిలో రేలంగి, డా॥ శివరామకృష్ణయ్య, గుమ్మడి, రమణారెడ్డి, పద్మనాభం కృష్ణకుమారి, సురభికమల నటించారు. సంగీత దర్శకుడు దక్షిణామూర్తి. దర్శకుడు యోగానంద్ ఈ చిత్రానికి కూడా ఇంకా పేరు పెట్టలేదు. ఇప్పటికి పాతిక కాల్ షీట్ల పని జరిగింది. ఫిబ్రవరి నెలాఖరుకు విడుదల చేయాలనుకొంటున్నారు. సుశిమో వాహిని.

## భరణీవారి 'చింతామణి'

భరణీ వారి 'చింతామణి' పూర్తి కావడానికి ఇంకొక్క సెట్టుపై పని మాత్రం మిగిలాయి. ఫిబ్రవరి నెలాఖరులోగా నే విడుదల చేయాలన్న సంకల్పంతో, దర్శకుడు రామకృష్ణ చురుకుగా నిర్మాణం సాగిస్తున్నారు. భానుమతి, జమున, ఋష్యేంద్రమణి, ఎన్. టి. రామారావు, రంగారావు, రేలంగి, రఘురామయ్య ఇందులో నటిస్తున్నారు. సంగీతం శ్రీమతి భానుమతి సమకూర్చింది.

## 1954 లో ఉత్తమ నటీనటులకు బహుమతులు

ఫిలింఫాన్స్ సంఘం (మద్రాసు) 1954 వ సంవత్సరంలో ఉత్తమ నటీనటులుగా ఎన్నుకొన్న వారందరికీ జనవరి 29 న బహుమతి ప్రదానం జరుగుతుంది. ఇందుకై ఈ సంఘం వారు పండుగ సెలవులలో చలనచిత్రాలు ప్రదర్శించి, అవసరమైన ధనం సేకరించారు.

ఈ సంఘం నియమించిన నిర్ణేతలబృందం గత అక్టోబరులో తమ నిర్ణయాల్ని ప్రకటించిన సంగతి తెలిసినదే.

1954 వ సంవత్సరానికి తెలుగు చిత్రాలలో వాహినీవారి 'పెద్దమనుషులు' ఉత్తమ చిత్రంగా ఎన్నిక అయింది. అందులో నటించిన శ్రీ ఎం. లింగమూర్తిని ఉత్తమ నటుడుగాను, విప్రనారాయణలో నటించిన శ్రీమతి భానుమతిని ఉత్తమ నటిగానూ, ఎన్నుకున్నారు. శ్రీ రేలంగి (పెద్దమనుషులు) ఉత్తమ ఉపపాత్రధారిగాను, శ్రీమతి జమున (మా గోపి) ఉత్తమ ఉపపాత్రధారిణిగాను, బాల నటుడు మాస్టర్ వెంకటేశ్వర్ (మాగోపి) పిల్లలలో ఉత్తమ నటుడుగాను ఎన్నిక అయ్యారు.

తమిళంలో ఉత్తమ చిత్రం ఎ. వి. ఎం. వారి 'అందనాళ్'. ఉత్తమ నటుడు శ్రీ శివాజీ గణేశన్ (తూక్కు తూక్కి) ఉత్తమ నటి శ్రీమతి పద్మిని (ఎదిర్ పారాదదు) ఉప పాత్రధారి తంగవేల్ (కుటుంబం) ఉప పాత్రధారిణి శ్రీమతి ఎం. ఎస్. రాజం (రక్తకన్నీర్)

నగరంలో ఉత్తమమైన థియేటర్‌గా మిడ్‌లాండ్ నిర్ణయించబడింది.

ఈ నిర్ణయాలు చేసిన సంఘానికి డా॥ యు. కృష్ణరావు అధ్యక్షుడు. వీరు 10 తెలుగు చిత్రాలు 12 తమిళ చిత్రాలు చూచి ఈ నిర్ణయాలు చేశారు.

## ముదావహం

ఆంధ్రలో సినిమా ఆపరేటర్ల పరీక్ష నిర్వహించడానికై ఆంధ్ర ప్రభుత్వం విజయవాడలో ప్రత్యేకం ఒకబోర్డు యేర్పాటు చేయ నిశ్చయించారు.

ఆంధ్రలో ఈ పరీక్షకు పూర్వం సేవా అంతా మద్రాసు వెళ్లవలసి వస్తున్నందువల్ల మనరాష్ట్రానికి ఒకపరీక్షాసంఘం నెలకొల్పాలని ఆంధ్ర ఫిలిం వాణిజ్యమండలి కొంతకాలంగా ప్రభుత్వాన్ని కోరుతూవచ్చింది. మొన్న డిసెంబరు ఆఖరువారంలో ఆంధ్ర ప్రభుత్వం ఈనిర్ణయం చేయడంతో ఆంధ్రలో పరీక్షార్థులకు ఒక పెద్దయిబ్బంది తప్పింది. కొత్త పరీక్షాసంఘంలో ఐదుగురు సభ్యులుంటారు. దీనికి ఆంధ్రప్రభుత్వ విద్యుచ్ఛక్తి శాఖ చీఫ్ ఇంజనీరుగాని ఆయన నియమించేవారుగాని అధ్యక్షుడుగా వ్యవహరిస్తారు. పరీక్షకు పాఠ్యప్రణాళిక, రుసుము, యితర నియమ నిబంధనలు ఈ సంఘమే నిర్ణయిస్తుంది. పరీక్షలకు విజయవాడ కేంద్రంగా ఉంటుంది.

ఇందుకు సంబంధించిన పనులన్నీ చూడడానికి ఒక గౌరవ కార్యదర్శిని నియమిస్తారు. దీనికి అయ్యే ఖర్చులన్నీ పరీక్షలకు కట్టే రుసుములద్వారా వసూలు అవుతాయి.

## స్వాగతం

## మద్రాసు ఫిలిం డైరీ 1956

ప్రచురణకర్త: శ్రీ వి. రామారావు ఈ సంవత్సరం దీనిని, భారతటాకీ రజతోత్సవ సంపుటంగా ప్రచురించారు. ఏటేటా పొందుపరచే వివిధ విషయాలతోపాటు మనదేశంలో తీసిన మొట్టమొదటి టాకీ ఆలం ఆరా, దక్షిణ భారతదేశంలో నిర్మించబడ్డ మొదటి టాకీ శ్రీనివాసకల్యాణం, మొదలయిన వాటికి సంబంధించిన కొన్ని చిత్రాలు, గత 25 సంవత్సరాల చరిత్రలో విశేషాలుకూడా ప్రచురించారు.

చలనచిత్ర పరిశ్రమ వివిధశాఖలకు సంబంధించిన విశేషాలు ప్రముఖుల గురించిన వివరాలుకూడా ఉన్నాయి. ప్రాప్తిస్థానం శ్రీ వి. రామారావు, 19, ఉడ్స్ రోడ్, మద్రాసు 2.

* * *

"ఆంధ్ర ఫిలిం చేంబర్ జర్నల్" నవంబర్, డిసెంబరు నెలల జంటసంచిక మా కార్యాలయానికి చేరింది. ప్రచురణ: ఆంధ్ర ఫిలిం వాణిజ్యమండలి—విజయవాడ. సంపాదకుడు శ్రీ ఎస్. కె. ఎన్. అయ్యంగార్.




(గత సంచిక తరువాయి)

కమల మంచంమీద ఎలా పడి ఉందో అలాగే ఉండిపోయింది. భర్త వెళ్ళిపోయిన తరువాత ఇక ఏడుపు ఆపుకోలేక పోయింది. చంటి పిల్లలా ఏడ్చివేసింది. పరుపూ దుప్పటీ ఆమె కన్నీళ్ళతో తడిసి పోయాయి. అయినా లోపలినుంచి ఇంకా బాధ కట్టలు తెంచుకు వస్తూనే ఉంది. ఆ బాధలో చచ్చి స్వర్గాన ఉన్న తల్లిదండ్రుల్ని తలచుకుంది. వారే బ్రతికి ఉంటే! ఒక్కసారి అమ్మ ఒడిలో తలదూర్చి "అమ్మా" అని బాధతీరా ఏడవ గలిగి ఉండును. ఓదార్పుకోసం ఆమె హృదయం తల్లడిలిపోతోంది. అన్నగారైనా ఆఖరికి వదినగారైనా తనదగ్గరుంటే బాగుండుననిపించింది. అన్నయ్య తన శోక ఉత్తరం, భర్తకు రెండుమూడు ఉత్తరాలు రాసి ఊరుకున్నాడు. అంతే. తనకెవరూ లేరు. తానెంత బాధపడినా జాలిపడేవారు లేరు. తాను బహుశా ఇక్కడే చనిపోతుందేమో. స్నేహితురాళ్లు తనను ఒకసారి నాగమణిని తలచుకున్నట్టే తలచుకుంటారు, మరచిపోతారు. కమల 'అమ్మ అమ్మ' అంటూ లేని అమ్మకోసం ఏడుస్తూనే ఉంది. చివరికి ఎంతటి బాధలనైనా మరపించే నిద్రాదేవి ఆవహించిందామెను.

బాగా ప్రొద్దు పోయేవరకూ లేవలేదు కమల. మెలకువ వచ్చిన తరువాత లేవబోతే శరీరం విపరీతమైన భారంగా ఉంది. మెల్లగా లేచి అద్దంలో చూసుకుంది. ఎడమ చెంప ఇంకా కొంచెం వాచే ఉంది. చేతివ్రేళ్ల గుర్తులు పూర్తిగా పోలేదు. జుట్టు చిందరవందరగా పడిఉంది. తన రూపం చూసుకుని తనే హడలిపోయింది కమల. అటు భర్తవచ్చి ఇంట్లో తిరుగుతున్నాడు. కమలకు మళ్ళీ అభిమానం వచ్చింది. త్వరగా లేచి స్నానం చేసివచ్చి ఒంటిమీద దెబ్బలు తగిలినచోటు అమృతాంజనం రుద్దుకుంది. మొగంమీద భర్త వేళ్ళగుర్తులు కనిపిస్తాయేమోనని పౌడరూ స్నో దట్టంగా పట్టించుకుంది. ఆపూట వంటచేయలేదు. అలాగే పోయి తన గదిలో కూర్చుంది. రాజారావు కొంతసేపు ఇంట్లో అటూ ఇటూ తిరిగి ఎక్కడికో పోతున్నాడు వస్తున్నాడు.

కమల కిప్పుడు అన్నగారిమీదా, వదిన గారిమీదా కోపం వచ్చింది. వారే జరిగిన దానికంతా కారకులు. ఈ కష్టాలు చూస్తే తెలుస్తుంది ఎవరికేనా వారెటువంటి పని చేశారో. అన్నగారూ వదినగారూ ఈ కష్టాలకు కారణం 'నీవే' అని ఆరోపించి తప్పుకుంటారు. తను తెలివైనదేగదా, తన తెలివితేటలతో భర్త నదుపులో పెట్టుకో లేకపోతే దానికి తామెట్లా బాధ్యులమంటారు. అవును, తానూ అనుకుంది తన తెలివితేటలవల్ల భర్తను సరియైనదారిలో పెట్టగలనని. కాని ఇప్పుడా ఆశ వట్టిదైపోయింది. తానోడిపోయినట్లేనా? తన చేతకానితనం చేతనే,నా ఈ కష్టాలు? తనకు తెలివితేటలు లేనట్లేనా? భర్త చెప్పినట్లు నడచుకుంటే ఈ బాధలేవీ ఉండవు. కాని అలాంటి జీవితం నడిపేకన్న ఉరిపోసుకు చావడం మేలు. తన వ్యక్తిత్వం నిలుపుకుంటూనే భర్త ప్రేమానురాగాలు పొంది అతని మనస్సు మారుద్దామనుకుంది. ఆ ప్రయత్నంలో అసఫలమవడం తన అసమర్థతేనా?- అయితే తెలివితేటలు లోపించేనా, తెలియజెప్పేవాళ్లు లేకేనా ప్రపంచంలో హత్యలూ, కొట్లాటలూ, యుద్ధాలూ జరుగుతున్నది? ఎప్పటినుంచో ఎందరెందరో మహానుభావులు గొప్ప గొప్ప సందేశాలు వెలువరిస్తున్నారే, సదుపదేశాలు చేస్తున్నారే, అయినా ప్రపంచంలో అన్యాయం ఇంకా ఉండడమేమిటి? అక్రమం జరుగుతూండడమేమిటి? కేవలం బుద్ధిశక్తివల్లే లోకాన్ని బాగుచేయగలిగితే లోకం ఏనాడో బాగుపడిపోయేది. భూమి కూడా స్వర్గంగా మారిపోయేది. బుద్ధిశక్తితో బాటు పశుశక్తి కూడా ఉండడంవల్లనే ఈ విధంగా ఉంది ప్రపంచం. ప్రతిసారి బుద్ధిశక్తే విజయం పొందుతుందని చెప్పలేం కడపటి విజయం దానిదైతే కావచ్చును కాని. తను కూడా తన భర్తను తన తెలివితేటలవల్ల మార్చగలుగుతా ననుకోవడం పెద్ద పొరబాటు. అటువంటి అవకాశమే ఉంటే తన ప్రయత్నమే అక్కరలేకపోయి ఉండును. అతనే ఎప్పుడో తెలుసుకొని ఉండేవాడు. అతని ముందు తన తెలివితేటలు పనిచేయక పోయినంతలో తన తెలివితక్కువ కాదు. ఈ విషయంలో తాను చేయగలిగింది ఏమీ లేదు. మరి తాను రోజూ ఇలా దెబ్బలు పడవలసిందేనా? ఎంత ఆలోచించినా ఏ ఉపాయమూ తోచడంలేదు. ఈ ఇంట్లో నుంచి పారిపోతే! అవును, పారిపోతే! కాని పారిపోవడమెలా? ఒకమారు దొడ్డి వైపుకూ ఇంటి చుట్టూరా చూసింది. నౌకర్లు తిరుగుతున్నారు. అందులోనూ ఒకడు చూస్తేనే రాక్షసుడిలా ఉన్నాడు - నల్లగా దున్నపోతులా తెల్లమీసాలతో - వీడెవడో కొత్తవాడు. కాపలాకే పెట్టిఉంటాడు భర్త. వాడు వేటకుక్క మాసినట్లుగా చూస్తూ తిరుగుతున్నాడు అటూ ఇటూ. వాడి చేతిలో కర్రకూడా ఉంది. అవును తనకు కాపలాయే ఇది. ఈ యింటినుంచి బయటపడడం అసంభవం. తనేమైనా తొందరపడితే ఎంతపనైనా చేయగలడు. గట్టిగా అరవడానికి కూడా వీలుండదు. దొడ్డిలో పువ్వుల [illegible] ధైర్యం కలిగిస్తున్నాయి [illegible] కూడా ఎవరో ఉన్నట్లనిపిస్తోంది. [illegible] నిక్కడనుంచి పారిపోలేదు. మరి ముందు మాట ఏమిటి?

మధ్యాహ్నం మళ్ళీ చుట్టుపక్కల స్త్రీలంతా వచ్చి పడ్డారు. కమల ఈవేళ వాళ్ళి నాహ్వానించే పరిస్థితిలో లేదు. అయినా వాళ్లను తివాచీమీద కూర్చోమని తనూ కూర్చుంది. వాళ్లు యధాప్రకారంగా వంటకాలతోనే ప్రారంభించారు సంభాషణ, కమల నోటికొచ్చినవి చెప్పివేసింది. ఆ

తరవాత వాళ్ళు మామూలు ప్రకారంలో వచ్చారు. కమలకావేళ లోపల బాధగలా చిరాకువల్లా వాళ్ళ సంభాషణ వినలేక పోతోంది. వాళ్ళంటే అసహ్యంకూడా వేసింది. అసహ్యం స్పష్టంగా కనిపించే టట్లు ఏమీ మాట్లాడకుండా కూర్చుంది. వాగి వాగి ఎంతకీకమలమాట్లాడకపోయేసరికి వాళ్లు "సరే వెళ్లివస్తామండి"అని లేచారు. మంచి దనుకొని కమల వాళ్ళను సాగనంపింది. వాళ్లువెళ్తూ ఒకరికొకరు సైగలు చేసుకుంటూ గుసగుసలాడుతూండడం కమల గమనించింది. వాళ్లను మరింత అసహ్యంచుకొని లోపలికి వచ్చింది. భర్త వచ్చాడు. దస్తావేజులు ఏవో చూసుకుంటున్నాడు. ఇంతలో సత్య నారాయణరావుగారి భార్య మరో నలుగురు స్త్రీలూ బండిలోనుంచి దిగారు. భర్త కేసి చూసింది కమల. అతనొకసారి వచ్చిన వారికేసి చూసి తలవంచుకొని దస్తావేజులు తిరగవేయసాగాడు. కమల వీధిలోకి పరుగెత్తి ప్రక్క గుమ్మంనుంచి వచ్చిన వారిని లోపలికి తీసుకు వచ్చింది. సూర్యనారాయణ రావుగారిభార్య ఆ కొత్తవారిని కమలకు అంతకు ముందురోజు పేరంటంలోనే పరిచయం చేసింది. వారు చదువుకున్న వారే. అందువల్ల ఒకరికొకరు సంతోషంతో నమస్కారాలు చెప్పుకున్నారు. కమల వారి కిల్లంతా చూపించింది. చివరకు దొడ్డివైపు గదిలో కూర్చొని కబుర్లలోకి దిగారు. కమలకు వాళ్లరాక ఎంతో సంతోషం కలిగించింది. ఆ క్షణంలో తన బాధ మరచిపోయింది. ఉల్లాసంగా కబుర్లు చెప్పసాగింది. చాలాసేపు ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పుకున్నాక మహిళాసంఘం స్థాపన విషయమై ఆలోచించారు. ఎలా స్థాపించాలి, ఎవరెవరిని చేర్పించాలి, ఎవరి నధ్యక్షురాలుగా పెట్టాలి, ఎవరు కార్యదర్శినిగా ఉండాలి, ముందేయే కార్యక్రమాలు ఆరంభించాలి మొదలైనవి చర్చిస్తూ అప్పుడే వార్షికోత్సవాలవంటివి ఎలా జరపాలనే వరకూ వెళ్లిపోయారు. తన ప్రస్తుత పరిస్థితులదృష్ట్యా తాను మహిళా సంఘంలో పాల్గొనడమనేది అనుమానాస్పదమేనని కమలకు తెలుసు. అయినా వారి ఉత్సాహాన్ని అణచడానికి ఇష్టపడలేదు. తన బాధ కూడా పైకి కనబడకుండా చూసుకుంది. వారెవరూ ఆమెలోమార్పు కనిపెట్టనేలేక పోయారు. చివరికి వరలక్ష్మమ్మగారే కనిపెట్టింది. "ఏమమ్మా ఈవేళ యెందుకో నీరసంగా కనిపిస్తున్నావ"ని అడిగింది. "ఏమీ లేదు నిన్న రాత్రి భోంచేయలేదు. అందువల్ల నీరసంగా కనిపిస్తున్నా"నంది కమల. "అయ్యో మందు పుచ్చుకున్నారా? ఇప్పుడెలావుంది? మా తెలివి తగలెయ్య. మేము మొదట్లోనే తెలుసుకోలేకపోయాం. నిన్ననవసరంగా బాధపెట్టాము" అంటూ వారు ఆందోళన వెలిబుచ్చారు. "ఈ వేళ బాగా తేలికపడిందండి. నిన్న రాత్రి ఉపవాసంతోనే తగ్గిపోయిందండి బద్ధకం. ఏమీ



> చైనాలో వినబడే సూక్తి:
> ప్రపంచం మొత్తంమీద మంచివాళ్లనురెండే రకాలుగా విభజించవచ్చు.
> పుట్టనివారు
> గిట్టనవారు.

పరవాలేదండి ఇప్పుడు" అని చెప్పి వాళ్లను కూడా సాగనంపి వచ్చింది కమల. వాళ్లు బండిలో వెళ్తూంటే వారికేసే చూస్తూ ఉండిపోయింది. ఎంతసేపలా నిలబడి ఉందో ఆమెకే గుర్తులేదు. "ఏం సరదా తీరిందా?" అని భర్త ప్రశ్నకు ఉలిక్కిపడి తిరిగి చూసింది. భర్త వనకాల నిలబడి వెటకారంగా చూస్తున్నాడు. కమల ఏమీ జవాబీయలేదు. "ఏం ఇదేనా చదువుకున్న ఆడవాళ్ళ మర్యాద. ఇంట్లో మగాడున్నాడని తెలిసికూడా ఆ ఇకిలింపులూ పరిహాసాలూ ఏమిటి? ఏమైనా సిగ్గూ అభిమానమూ ఉండేవాళ్ళేనా వారు?" అని అడిగాడు. కమలకు చాలా కోపం వచ్చింది. తన స్నేహితురాండ్రను ఆక్షేపించడమా! వారేమీ అసభ్యంగా ప్రవర్తించలేదే! నలుగురూ కలుసుకున్నప్పుడు సరదాగా ఉండక పోతే ఎందుకు? అతని స్నేహితులు అంత గోలచేస్తే, తననుగురించి కూడా అంత నీచంగా మాట్లాడితే లేదుకాని వీరు కాస్త నవ్వుకుంటూ మాట్లాడారని ఆక్షేపణ! వారికి సిగ్గూ అభిమానమూ లేదనడమా? కమల సహించలేక "వాళ్ళ నాక్షేపించ నక్కర్లేదు" అంది. రాజారావు కళ్ళలో మళ్ళీ మంటలు వెలిగాయి. "ఏమిటే వాళ్ళ నాక్షేపించ నక్కర్లేదూ. వాళ్లను వెనక వేసుకు వస్తున్నావా? నీవుకూడా వాళ్ళ ఇంటికి పోయినప్పుడు ఆడదాని కుండవలసిన సిగ్గూ సంకోచమూ లేకుండా ప్రవర్తిస్తున్నావన్నమాట. మీ చదువుకున్న స్త్రీలందరికి ఇదేనన్నమాట ప్రత్యేకత", అంటూ ఎదురకు వచ్చాడు. అతని కళ్లూ వాలకం చూసేసరికి కమలకెందుకో ఒక్కసారిగా భయమేసింది. చటుక్కున తనగదిలోకి పరుగెత్తి తలుపు వేసుకోబోయింది. కాని రాజారావు వెనకాలే వచ్చి ఆపేశాడు. పట్టుకున్నాడు. "ఏం భయమేస్తోందా? ఊం మెల్లమెల్లగా తెలిసివస్తోందన్నమాట! ఏం ఇప్పటికయినా బుద్ధి తెచ్చుకున్నావా?" అన్నాడు అతను. ఆమెను దగ్గరకు లాగి

మొగంలోకి తీక్షణంగా చూశాడు. కమలకు మళ్ళీ అభిమానం వచ్చింది. నిర్భయంగా కళ్లల్లోకి చూసింది మీరేం చేయగలరన్నట్లు. రాజారావు ఆమె మొగంలో మొగం పెట్టబోయాడు. కమల చేతితో గట్టిగా తోసింది. దానితో అతడు అగ్గయిపోయి మళ్ళీ కొట్ట నారంభించాడు. కమల పళ్లు బిగించి ఒక్క ఊఁ అన్న శబ్దమైనా పైకి రానీయలేదు. మంచంకోడు మీదకు తోసివేశాడు రాజారావు ఆమెను. గట్టిగా గప్పుమంది. అయినా కమలనోట శబ్దం రాలేదు. రాజారావు దీర్ఘంగా ఊపిరి తీసుకొని "ఒక పట్టాన లొంగవన్నమాట. ఊఁహూఁ. రేపటిలోగా నీచేత ఏడ్పు తెప్పించి నాకాళ్లమీద పడేటట్లు చేయకపోతే నా పేరు రాజారావుకాదు" అని విసురుగా లేచి వెళ్లిపోయాడు.

రాజారావు వెళ్లగానే కమల ఎలాగో లేచి వెళ్లి తలుపు గడియ వేసుకొని మళ్ళీ మంచంమీద పడిపోయింది. తెల్లవారిన తరువాత లేచిందికాని గడచిననాటి సంఘటనలు తలచుకొని భయంతో బాష్పతో వెనకకు పడిపోయింది. ఇప్పుడామెను భయం పూర్తిగా ఆవహించివేసింది. భర్తమాట తలచుకుంటే గుండె దడదడ కొట్టుకుంటోంది. భర్త ఎదుట పడకుండా ఉంటే చాలునని పిస్తోంది. తనమాట నిలుపుకోవాలన్న పట్టుదల ఇప్పుడు సడలిపోతోంది. భర్త గుడ్లురిమి హుంకరిస్తే ఇప్పుడు తాను ధైర్యంగా నిలబడగలనన్న నమ్మకంకూడా పోయింది. భర్త బయట తిరుగుతూంటే ఏదో భయంకరమైన మృగం ఇంటిచుట్టూరా తిరుగుతున్నట్లుగా ఉంది. చాలాసేపటికి భర్త వెళ్లిపోయాడన్న నమ్మకం కలిగినతరువాత మెల్లగా లేచి తలుపుతీసి ఇవతలకు వచ్చింది. నీళ్లుపోసుకుందామని నీళ్ళగదివైపుకు నడచింది. నౌకర్లు పొయ్యిచేసి ఉంచారు. నీళ్లు కాగుతూనే ఉన్నాయి. చన్నీళ్లు పోసుకోవాలేమోనని భయపడిందికాని వేడినీళ్లుండడంచూసి తెరపినబడింది. గదిలోపలికి అడుగుపెట్టగానే బోరగిల పడిపోయింది. అలాగే నేలమీద ఉండిపోయింది. ఒళ్లు తేలిపోతున్నట్లుంది. చెవులు గళ్ళుకుతున్నాయి. కళ్ళు మూతలుపడుతున్నాయి. తాను పొరబాటు చేశాననుకుంది. కమల ముందురోజూ, అంతకు ముందు రాత్రీ భోజనం చేయకపోవడంలో. ఇప్పుడు నీరసంవల్ల తనే బలహీనమయిపోతోంది. ఒంట్లో బలమున్నట్లయితే బాధ ఎక్కువగా సహించడానికి శక్తిఉండేదేమో. కమల అలాగే ఉంది ఐదునిమిషాలు మూలుగుతూ. ఎంత మూలిగినా ఆలకించేవారెవరు? పైకి లేవనెత్తేవారెవరు? ఆఖరికి తనే మెల్లగాలేచి కుర్చీపీటమీదకూర్చొని వేడినీళ్లు తీసుకోబోయింది. చెంబు నీళ్లలో ముంచిందికాని పైకి తీయడానికి ఓపికలేకపోయింది. ఒళ్ళు దడదడలాడుతోంది. మళ్లీ కొంతసేపటికి ఎలాగో ఓపిక తెచ్చుకొని రెండు చెంబులు పోసుకుంది. కాని వేడినీళ్లు పోసుకోవడంవల్ల కొద్దిసేపు నీరసం మరీ ఎక్కువైంది. అలాగే చెంబు వదిలేసి ప్రక్కగుండె గమీద ఆనుకుంది. తన పరిస్థితి తలచుకొని వెక్కి వెక్కి ఏడవసాగింది. ఏడుపు పైకి వినిపిస్తే నౌకర్లకు తెలుస్తుందేమోనని నోట్లో గుడ్డ కుక్కుకుని ఏడ్చింది. కొంతసేపటికి ఏడుపు ఆపుకొని నీళ్లు పోసుకుంది. తుడుచుకోకుండా కొంతసేపుంది. ఎవరైనా తుడిస్తే బాగుండును అనిపించింది. ఎలాగో లేచి తుడుచుకొని పొడిబట్టలు వేసుకొని గోడకానుకుంటూ అవతలికి నడిచింది. కాని తన గది చేరగలనా లేనా అని భయంవేసింది. ఈలోపుగా భర్తవస్తే! ఆభయంతో త్వరగా నాలుగడుగులు వేసింది. అన్నం తింటే బాగుండునేమో. కాని ఇంట్లో అన్నమేది? వండందే ఎలావస్తుంది? వండుకోవడానికి అసలు శక్తిలేదు. పోనీ కాఫీ చేసుకొని త్రాగుదామని వంటింట్లోకి వెళ్లింది. కాఫీ చేయడానికికూడా సత్తువ లేక, వేడిపాలే తీసుకొని, పడుకొనీ కూర్చునీ ఎలాగో చల్లార్చుకొని త్రాగింది. కొంతసేపక్కడే ఉంది. కాస్త ఓపికవచ్చినట్లయిన తరువాత లేచి వెళ్లి తనగదిలోకి పోయి తలుపు గడియ వేసేసుకుంది.

రాజారావు వచ్చి ఇంట్లో కొంతసేపుండి మళ్ళీ బయటకు పోతున్నాడు. అతను వీధిలోకి వెళ్లిన సమయంలోనే కమల తలుపు తీసుకువచ్చి మంచినీళ్లుత్రాగి తలుపు వేసేసుకుంటోంది. ఎన్నాళ్లిలా ఉండడం, ఎన్నటికైనా అతని కంటబడకుండా తప్పించుకోగలనా అనేది ఆమె ఆలోచించడంలేదు. అప్పటికి అతని ఎదుటపడకుండా ఉంటే చాలు ననిపిస్తోంది. గదిలో పడుకొని వాచిపోయిన ఒళ్ళు రుద్దుకుంటూ కన్నీరు కారుస్తూ ఉండిపోయింది. సాయంత్రం వేళ తలుపుకొట్టినచప్పుడైంది. కమల అదరిపడిలేచి కూర్చుంది. రాజారావే తలుపు బాదివేస్తున్నాడు. "ఏయ్ తలుపు తీయి, తీయవేం, తలుపు పగలగొట్టుకు రమ్మంటావా? ఆలస్యం చేశావంటే అంతపనీ చేస్తాను" అంటూ అరుస్తున్నాడు. మాటలు బాగా తడబడుతున్నాయి. బాగా త్రాగివచ్చినట్లున్నాడు. అతను తలుపు కొట్టూంటే కమలకు గుండె మీద సమ్మెటపెట్టి కొట్టినట్లుంటోంది. గుండె చేతితో నొక్కిపట్టుకుని కూర్చుంది. గాలిలో ఆకులాగ గజగజలాడిపోయింది భయం ఇంకా ఎక్కువై మంచంమీద బోరగిలబడి తలగడలో మొగం దాచుకుంది అలా చేస్తే ప్రమాదం తప్పిపోతుందన్నట్లు. కొట్టి కొట్టి విసుగు పుట్టింది కాబోలు రాజారావు వెళ్ళిపోయాడు. చాలాసేపటివరకూ తిరిగి రాలేదు. ఇక ఆ వేళకు రాడేమో ననుకుంది కమల. కాని చీకటి పడిన తరువాత ఏడు ఎనిమిది గంటలమధ్య రాజారావు బయట నిలబడి 'కె. కమలాదేవి, డిస్పాచ్ క్లర్కు, నేషనల్ ట్రేడింగు కంపెనీ, విజయవాడ' అని చదవడం మొదలు పెట్టాడు. కమల ఉలిక్కిపడి లేచి నిలబడింది. రాజారావు "ఫ్రమ్ రఘు, హరిద్వార్, ఏమిటే ఉత్తరంనిండా ఇన్ని ముద్రలు, చాలాచోట్ల ప్రయాణం చేసి వచ్చినట్లుందే" అంటున్నాడు. రఘు ఉత్తరం రాశాడు! ఇన్నాళ్లూ రఘు మాటే మరచిపోయింది. ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. అతను చేసిన ప్రయత్నం కూడా జ్ఞాపకం వచ్చింది. చేసినది చాలక ఈ ఉత్తర మేమిటి? తను బ్రతకడం కూడా ఇష్టం లేదా ఆ మనిషికి. గోరుచుట్టుమీద రోకలిపోటులా ఏమిటే ఉత్తరం? కమల తలుపుతీసి బయటకు వచ్చివేసింది. రాజారావు కవరు చింపబోతున్నాడు. "నా ఉత్తరం చింపుతా రెందుకు? నాది నా

 అబల 

కిచ్చివేయండి" అంది కమల దగ్గరకు పరుగెత్తి. ఆదుర్దాలో భయం కూడా మరచిపోయి. "ఏం, ఎందుకివ్వాలి. నేను చదవందే ఇంకా" అన్నాడు వికారంగా నవ్వుతూ రాజారావు. "నా ఉత్తరం చదవడానికి మీకు బుద్ధి ఎలా వస్తుంది? ఇదేనా మీ మర్యాద. నా ఉత్తరం నా కిచ్చివేయండి" అని కమల అతని చేతిలో ఉత్తరం లాగుకోబోయింది. రాజారావు ఆమెను ప్రక్కకు త్రోసివేశాడు. కమల మళ్ళీ ప్రయత్నించింది. రాజారావు "ఆగు, వెర్రివేషాలు వేయకు. నేను ఉత్తరం చదివి తీరుతాను లాగుకోడానికి ప్రయత్నిస్తే ఏమవుతుందో నీకే తెలుసు. నీ సిద్ధాంతం ప్రకారం నీ ఉత్తరం నేను చదవకూడదేమో. కాని నా సిద్ధాంతం భర్త సర్వాధికారి, ఏం చేసినా చేయవచ్చుని. నా సిద్ధాంతం ప్రకారం నేను నీ ఉత్తరం చదవవచ్చు. నా హక్కు నేనుపయోగించుకుంటాను. అనవసరంగా అడ్డురాకు. పద, నీ ముందే చదువుతాను" అని లోపలికి నడిచి మంచం మీద కూర్చున్నాడు. కమలను కూడా ప్రక్కన కూర్చోమన్నాడు. కాని కమల నిలబడే ఉంది అదురుతున్న గుండె నగుపులో పెట్టుకుందుకన్నట్లుగా చేతితో నొక్కుకుంటూ. "సరే నీకు నిలబడాలని సరదాగా ఉన్నప్పుడు నేనెందుకు బలవంతం చేయాలి" అని రాజారావు కవరునుంచి కాగితం తీసి చదవడం మొదలు పెట్టాడు.

హరిద్వార్,

శ్రీకమలాదేవిగారికి నమస్కారాలు.

మీరు బహుశా చేసింది చాలక ఏమిటీ ఉత్తరం అనుకుంటారు. అలా అనుకుంటారనే భయంతోనే వ్రాయనా వద్దా అని సందేహించాను. ఇప్పుడు వ్రాసి వేస్తున్నాను మీ రే శిక్ష విధించినా స్వీకరించడానికి. ఇప్పుడు మీకు క్షమాపణ చెప్పుకోవడం కాలితో తన్ని పొరబాటనడం వంటిది. చేసిన పని క్షమార్హం కాదు కాబట్టి. అయినా ఆశించరానిదైనా ఆశించడం మానవ నైజం కదా—ఆశించిన ఫలితం లభించకపోయినా. హృదయంలోని భారం వెళ్ళబుచ్చుకోవడమనేదే ఫలితంగా భావించుకోవచ్చునేమో. ఆనాడు నేను చేయబోయినది నీచాతినీచమైనదని నేను చింతిస్తున్నాను. మీరు దేవతాతుల్యులు కాబట్టి నేను పూర్తిగా పశువునై పోకుండా కాపాడారు. ప్రమాదం తప్పించారు. అందుకు సదా కృతజ్ఞుణ్ణిగా ఉంటాను. మీ ధైర్యం నేను కొనియాడుతున్నాను.

నన్ను ఒకటి బాధిస్తూ ఉంటుంది మానవుడు ఇటువంటి తప్పటడుగులు ఎందుకు వేస్తాంటాడా అని. అవును. లోపాలే లేకపోతే మానవుడు కూడా దేవుడైపోవునేమో. లోపాలుండబట్టే మానవుడుగా ఉంటున్నాడేమో. ఆ లోపాలను తెలుసుకొని అంతకంతకు పైకిపోవడం మానవలక్షణం—కాదు, లక్ష్యం. అలక్ష్యసాధనకు ప్రయత్నంలోనే మానవుడు తన నిజవ్యక్తిత్వం నిరూపించుకుంటాడనుకుంటాను. కాని ఒకొక్కసారి చేసినతప్పు ఎంత హాని చేస్తుంది! ఒక్కమాట, ఒక్కచేత చాలు కడివెడు పాలను ఒక్క మజ్జిగచుక్క విరిచివేసినట్లు, మనిషి మర్యాదను మంటపాలు జేయడానికి. ఆనాడు నేను వివశుణ్ణయిపోయాను. నన్ను నేను మరిచిపోయాను. పశువుగా ప్రవర్తించాను. కాని రఘు మొదటి నుంచీ అలాంటివాడేనని మీరు భావిస్తారేమోననే ఆవేదనతోనే ఈ లేఖ వ్రాస్తున్నాను. రఘు మొదటినుంచీ అటువంటి వాడు కాడని తెల్పుకోడానికే ఈ నివేదన. నేను చేసిన తప్పును కప్పిపుచ్చడానికి ప్రయత్నించను. ఆనాడొక్క చెడ్డ చేసినందుకు ఈనాటివరకూ ఎంత బాధపడుతున్నాను. ఏ దండనా పశ్చాత్తాప దండనతో సమానం కాదేమో ననుకుంటాను. మనస్సులో పుట్టిన చిచ్చు చల్లారడం లేదు. ముందుముందుల మీదైనా మనశ్శాంతి లభిస్తుందేమోననే ఆశతో పోతున్నాను. కాని ఆ ఆశ ఫలిస్తుందో లేదో కూడా చెప్పలేను. ముందేమో.

కుండో భవిష్యద్గర్భంలో దాగి ఉంది. చేయబోయిన పని ఎంత అక్షమ్య మయినా అంతకు ముందువరకూ చూపిన సహృదయతే ఇప్పుడుకూడా చూపి హృదయంలో క్షమి స్తారనే ఆశతో చూస్తూ పశ్చాత్తాప జ్వాల లతో దహించుకు పోతున్న దీనుడు,

రఘు.

అని చదివి "ఎవడో కవిలాగున్నాడే. చేటభారతం రాశాడు" అన్నాడు రాజారావు ఆశ్చర్యంతో కాగితంకేసి చూస్తూ. కమల గుండె తేలికపడింది. ఉత్తరం తాననుకున్నంత హానికరంగా లేదు. "అయిందిగా చదవడం, ఇప్పుడేనా ఈ ఉత్తరం యిస్తారా?" అని అడిగింది. రాజారావు ఆమెకేసి తీక్ష్ణంగా చూశాడు. నీకూ ఏదో రహస్య మున్నదన్న మాట. కాని ఆ ఉత్తరం నీలాటి వాళ్లకు పెద్దపెద్ద కబుర్లు చెప్పడమే కాని పెడదారి పట్టేటంత సాహసం ఉండదని నేననుకున్నది నిజమని చూపించింది. నీనడత విషయంలో నాకు అనుమానం లేదు. అందుకే నిన్ను పెళ్ళిచేసుకున్నాను. నా నిర్ణయం తప్పుకాదని ఈ ఉత్తరం చూపిస్తోంది. నీ రహస్యం నీవే దాచుకోలే. నే నడగను. కాని ఈ ఉత్తరం నాదగ్గరే ఉండాలి. అవసరమయితే ఆయుధంగా ఉపయోగించేందుకు" అని రాజారావు ఉత్తరం మడిచి జేబులో పెట్టుకున్నాడు. లేచి చటుక్కున కమల చేయిపట్టుకొని మంచంమీదకు లాగాడు. కమల విడిపించుకోవడానికి ప్రయత్నం చేసింది. రాజారావు ఉక్కుపట్టులో ఆమె చేయి బిగించి బలవంతాన కూర్చోబెట్టాడు. "ఏం, తలుపులు వేసుకొని కూర్చుంటున్నావే! తప్పించుకుందామనా? ఎన్నాళ్లని ఇలా తప్పించుకు తిరుగుదామనుకుంటున్నావు? వంటయింటి కుందేలు ఎన్నాళ్లు తప్పించుకు తిరుగుతుంది? భయం వేస్తోంది కదూ. ఏవో పెద్ద కబుర్లు చెపుతావే నాతో నీవు సమానమని. మరిఎందుకు తలుపులు వేసుకొని దాగుంటావు? నాకు దేహబలం ఉంటే నీకు సహనబలం ఉందన్నావు కాదూ. అది చూపించు. అలా ఒంకుతావెందుకు? ఇప్పుడు బాగా తెలిసి వచ్చిందనుకుంటాను భర్తతో సమానం కావడం ఎంతకష్టమో! ఏం? మళ్లీ చెపుతున్నాను కమలా. నీవు నన్ను తప్పించుకోలేవని. నీ ప్రతి చర్యా నాకు తెలుస్తూనే ఉంది. ఎన్నడైనా నాకు తెలియకుండా గడపదాటావంటే ఏం జరుగుతుందో నేను చెప్ప నక్కర్లేదు. పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు వాటినిబట్టే నడుచుకోవడం తెలివైనవాళ్లలక్షణం నీవు తెలివైనదానివి కాదూ. ఈ యింట్లో నన్ను కాదని బ్రతకలేవు. కాబట్టి నేను చెప్పినట్లు నడచుకొని తెలివైనదాని వనిపించుకో. ఆఖరిసారి ఐదు నిమిషాలిస్తున్నాను లొంగిపోవడానికి. నేను చెప్పాను కాదూ ఈ వేళ నీచేత ఏడిపించి నా కాళ్ళమీద పడేటట్లు చేయకపోతే నా పేరు రాజారావు కాదని. ఆ మాట చెల్లించుకు తీరుతాను" అన్నాడు భయంకరమైన వికటహాసం చేస్తూ. అతని కళ్ళు లేడిరక్తం చూసిన పులి కళ్ళల్లా వెలుగుతున్నాయి. కమలగుండె జారిపోతోంది. అతని మాటలు విని ఒక్కసారిగా నిలువెల్లా వణకిపోయింది. బింకంగా ఉందామని ప్రయత్నించింది కాని శరీరం వశంలో లేనట్లుంది. చెదరిపోతున్న మనస్సును చిక్కబట్టుకోవడానికి ప్రబల ప్రయత్నం చేస్తోంది. మళ్ళీ అన్నాడు రాజారావు వెటకారంగా. "ఏం పలుకవేం? పెద్దగా వాదిస్తావేం. ఆ వాదన ఏమయిపోయింది? ఇంటర్ మీడియేట్ చదివిన దానివిగా, ఉద్యోగంచేయ నేర్చినదానివిగా. ఊఁ వాదించు" కమలకు వాదించడానికి శక్తియెక్కడ ఉంది ఇప్పుడు? రాబోయే విపత్తు నెదుర్కొవడానికే శక్తి నంతా కేంద్రీకరించుకోవలసి వస్తోంది. శరీరాన్ని అదుపులో పెట్టుకోవడంలోనే నిమగ్నమై ఉంది. "ఊఁ మాట్లాడవేం. నిమిషాలు గడచిపోతున్నాయి ఒకటి, రెండు, మూడు-నాలుగునిమిషాలు గడిచాయి" అన్నాడతి మెల్లగా. కమల ఒక్కమారు అన్నిశక్తుల్నీ కూడగట్టుకుంటోంది. "పశువుగా బ్రతికే కన్న ప్రాణం పోగొట్టుకోవడానికైనా సిద్ధం-" అంటూనే ఉంది రాజారావు ఎడమచేతితో నోరు నొక్కివేశాడు. దవడ ఎముకలు లోపలికి విరిగిపోతున్నట్లున్నాయి. నరాలు పట్టు తప్పిపోతున్నాయి. మనస్సును తెరలు కప్పుతున్నట్లవుతోంది. ఊపిరి త్వర త్వరగా వచ్చివేస్తోంది. ఆఖరి క్షణం వచ్చిందనుకుంది, కమల. కాని రాజారావు అంత తేలికగా విడిచేవాడు కాడు. నోటిమీద చేయితీశాడు. చేతులు పట్టుకొని నలిపి వేయసాగాడు. వేళ్లు పిప్పి అయిపోతున్నట్లున్నాయి హృదయం పగిలిపోయింది. ఏడుపు కట్టతెంచుకుంది. రాజారావు ఇంకా పట్టువిడవలేదు. "ఊఁ ఏడు, ఏడు అహంకారం కడిగివేసుకో" అని ఆమెను కిందకు తోశాడు. కమల అక్కడే అతని పాదాల దగ్గర పడిపోయి పేగు లరిగిపోయేటట్లుగా ఏడుస్తూనే ఉంది. రాజారావు కొంతసేపు చూసి చూసి ఆమెను పైకి లేవనెత్తి ఒడిలో కూర్చోబెట్టుకొని రొమ్ముకు చేర్చుకొని ఆమె మొగంలోకి చూస్తున్నట్లున్నాడు. కమల కన్నీటి కంతులేనట్లుంది. ఎక్కడ ఉందో అంత నిలువ! క్రమంగా ఆ కన్నీరు కూడా ఇంకిపోయింది. రొమ్ముఎగిరి పడడం తగ్గింది. నిస్సత్తువతో మైనపుబొమ్మలా అయిపోయింది. రాజారావు ఆమెను మెల్లగా పడుకోబెట్టాడు. లేచి వెళ్లి తలుపు వేసి వచ్చాడు.

మర్నాడు ప్రొద్దున, కమల లేచేటప్పటికి రాజారావు ఆమెఎదుట నిలబడి ఆమెమీదకు వంగి చూస్తున్నాడు. అతన్ని చూడగా కమలకు తిరిగి కన్నీరాగలేదు. ఏడుపు పెకలించుకు వస్తోంది. రాజారావు కొద్దిసేపుండి మెల్లగా జోకొట్టుతున్నట్లు అన్నాడు: "ఊఁ, ఇక ఏడుపు కవసరం లేదులే మలా ఇకముందు నిన్నెలా చూస్తానో చూడు. లే మొగంకడుగుకొని నీళ్లు పోసుకో. నీవు ఇలావుంటే బాగుండదు. ఏదైనా ఆహారం వెంటనే తీసుకోందువుగాని. నీరసం నిన్నే బలహీనని చేస్తుంది, లే" అని ఆమెకు చేయి అందిచ్చి లేపబోయాడు. కమల ఒంట్లో సత్తువ అనేదే లేకపోయింది. ఎలా పడవేస్తే అలా ఉండిపోతోంది. రాజారావు ఆమెను చేతుల్లోకి ఎత్తుకొని స్నానాలగదికి తీసుకు వెళ్లాడు. అక్కడ కుర్చీ పీటమీద కూర్చోబెట్టి వేడినీళ్లూ, పౌడరూ, అన్నీ ఇచ్చి "మొగం కడుకొని నీళ్లుపోసుకో. ఇంతలో కాఫీ చేస్తాను" అని చెప్పి తలుపు జేరవేసి ఇవతలకు వచ్చాడు. కొంతసేపటికి కమల స్నానం చేసి బయటికి వచ్చింది. ఆమె మనస్సేమీ పని చేయడంలేదు. మాయలో పడిపోయి

నగ్న సత్యం

"నేను మొట్టమొదట చెన్నపట్టం వచ్చిన నాడు చేతిలో చిల్లిగవ్వ లేదు. మారు కట్టుకోడానికి మరో జత బట్టలు కూడా లేవంటే నమ్మ..." అన్నాడు ఇల్లూ వాకిలీ కట్టి ప్రయోజకుడైన పెద్దమనిషి.

"నేను అసలు ఒక్క జత కూడా లేకుండా ఇక్కడికి వచ్చాను తెలుసా?"

"నిజంగా?"

"ఒట్టు... నే నిక్కడే పుట్టానుగా."

కలేంది. రాజారావు వచ్చి ఆమెను మళ్ళీ ఆమెగదిలోకి తీసుకువెళ్ళి మంచం మీద కూర్చోబెట్టి కాఫీతీసుకువచ్చి ఆమెచేత త్రాగించాడు. అతనేం చెప్పితే అది వెంటనే చేతవేస్తోంది కమల. రాజారావు లేచి నౌకరుచేసి ఊళ్ళో ఉన్న ఇంకో వంట మనిషిని పిలిపించి వంటచేయించాడు. పాతమనిషినికి కబురంపించాడు. వంట అయిన తరువాత వంటమనిషిని పంపివేసి తను పెట్టుకు తిని, వెండి కంచంలో అన్నంకూర వగైరాలు పెట్టుకొని కమలకు తీసుకువచ్చి తినిపించాడు. తల్లిముందు కూర్చున్న చంటిపిల్లవాడిలా ఉంది కమల. భోజనమయినతరువాత రాజారావు కమల ప్రక్కనే కూర్చొని ఆమెతల నిమురుతూ "పిచ్చిపిల్లా, కష్టాలు కోరి తెచ్చుకున్నావు. అనవసరంగా క్షోభపడ్డావు. నన్ను రెచ్చగొట్టడం ఎప్పుడూ మంచిది కాదు. నీవు నేను చెప్పినట్లు నడచి ఉంటే ఎప్పుడూ ఎదురు ప్రశ్నలు వేయకుండా ఉంటే నీకీ బాధ లేకపోవును. ఎప్పుడో నాకు తోచినప్పుడు నేనే చెప్పేవాణ్ణి నీవు సూర్యనారాయణరావుగారి ఇంటికి ఎందుకు వెళ్ళకూడదో. ఆ సూర్యనారాయణరావు మా గోవిందానికి ఎదురుపక్షాన పనిచేసి చేతిలోకి వచ్చిందనుకున్న చక్కని ఆస్తి రాకుండా చేశాడు. పెద్ద నిజాయతీ పరుడనని ఆయనకు గర్వం. ఆయన నిజాయతీపరుడైతే ఎవరికి కావాలి, నిజాయతీ పరుడు కాకపోతే ఎవరికి కావాలి? ఆయన మా గోవిందానికి శత్రువు. అందుచేత నాకూ శత్రువే. నాకు శత్రువైనవాళ్లు నా భార్యకూ శత్రువులే అయి ఉండాలి. అందుకే నిన్ను వారింటికి వెళ్ళవద్దన్నది. నిన్ను పరీక్షించడానికే నీకు కారణం చెప్పలేదు. నీవు నామాట విన్నావుకావు. నా తత్త్వంఅర్థం చేసుకోకుండా ప్రవర్తించావు. ఎదిరింపు సహించని తత్త్వం నాది. నేను చెప్పినట్లు నడచుకున్ననాడు నాలో ఎంత జాలి ఉందో, ఎంత ప్రేమ ఉందో నీకే తెలుస్తుంది. సరే, ఈవేళ ఎక్కువగా కదలకు. రెండురోజులు అన్నం తినకుండా మాడావు. ఇంకా నీరసంగా ఉన్నావు. కాస్త తిండి ఒంటబట్టి బలం వచ్చిన తరువాత లేవచ్చు. ఏమీ తొందరలేదు. వంట మనిషికి కబురంపాను. నీ విక నుంచి మళ్ళీ కాలు కదప నక్కర్లేదు. అన్ని పనులూ అవే జరిగిపోతాయి. నీవు రాణీగారిలా కూర్చొని అనుభవించు, అంతే" అని ఆమె బుగ్గన చిటికవేసి లేచివెళ్లాడు.

మధ్యాహ్నం రెండుగంటలవేళ తిరిగి వచ్చాడు. చేతిలో ఒక పాకెట్టూ కొన్ని పొట్లాలూ ఉన్నాయి. పొట్లాలు విప్పాడు. మైసూర్‌పాక్, మిక్చర్ కమలకు పెట్టాడు. తను తిన్నాడు. తరువాత పాకెట్టు విప్పాడు. పట్టుచీర, ఎర్రగా మెరిసిపోతోంది. దాని మీద అంతటా బంగారు మామిడిపళ్లూ, చుట్టూ అరచేతి వెడల్పు అంచూ ఉన్నాయి. మడతవిప్పి కమలమీదవేసి కట్టుకు రమ్మన్నాడు. కమల లేచివెళ్ళి కట్టుకు వచ్చింది. ప్రక్కను కూర్చోబెట్టి జేబులోనుంచి ఏదో తీసి మెడలోవేశాడు. కొత్త నెక్‌లెస్. నీలం, ఎరుపూ, తెలుపు రాళ్ళతో విచిత్రమైన డిజైనులో తళతళ మెరిసిపోతోంది. రాజారావు కమల ఆ పట్టుచీర కట్టుకొని, నెక్‌లెస్ పెట్టుకుంటే చూసి ఆనందం పట్టలేక దగ్గరకు లాగుకున్నాడు. కాని కమల మొగంలో సంతోషమూ లేదు విచారమూ లేదు. ఏదో నిర్లిప్తత నిండిఉంది. బొమ్మ మాదిరిగా చలనం లేకుండా ఉండిపోయింది. రాజారావు ఇప్పుడెక్కువసేపు ఇంటిదగ్గరే ఉంటున్నాడు. కమలను విడిచిపెట్టిపోవటం లేదు. కమలతో కాలక్షేపం చేయని వేళల దస్తావేజులలో మునిగి ఉంటున్నాడు. అప్పుడప్పుడు మాత్రం ఊళ్లోకి పోయి వస్తున్నాడు. ఇంట్లో వంటమనిషి వచ్చింది. పనిమనుషులు అన్ని పనులూ చేస్తున్నారు. కమల తన గదిలోనే కూర్చొని చాకిరీ చేయించుకుంటోంది రాజారావు చెప్పినట్లు. ఆమెను చూసినవారు ఇప్పుడామెను గుర్తించడమే కష్టం. ఆమె మాట్లాడడమే తక్కువైపోయింది. ఎప్పుడూ మంచంమీద పరుండో, కుర్చీలో కూర్చునో, శూన్యదృక్కులతో చూస్తూ కూర్చుంటోంది. పుస్తకాలెలా ఉన్నాయో కూడా చూడడం లేదు. భర్త వచ్చినప్పుడు మాత్రం భర్త చెప్పినట్లు యంత్రంవలె చేస్తోంది. ఆమె మనస్సులో ఏ ఆలోచనలూ పని చేయడం లేదు. కాలం దొర్లిపోతోంది.

నాలుగురోజులు పోయిన పిమ్మట ఒకనాడు కమలకు అన్నగారిదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. తాను రాజారావుకు మూడు ఉత్తరాలు వ్రాసినా అతను సరిగా జవాబీయలేదని, సాయం చేస్తానని మొదట్లో మాట ఇచ్చినవాడు ఇప్పుడు ఇలా ఎందుకు మాట్లాడటం లేదో తన కర్థం కావటంలేదనీ, తనపరిస్థితి చాలా కష్టంగా ఉందనీ, సమయానికి రాజారావు సాయం అందకపోతే తన వ్యాపారం పూర్తిగా ఎత్తివేసి మామగారింటికి చేరుకొని వాళ్ల కొట్టులో గుమాస్తాగా ఉంటూ వారి దయా దాక్షిణ్యాలమీద ఆధారపడవలసి వస్తుందనీ, అది తనకెంతమాత్రం ఇష్టం లేదనీ కాబట్టి రాజారావుతో తనపరిస్థితి వివరంగా తెలియజేసి చేస్తానన్న సాయం అందేటట్లు చేయించవలసిందనీ, రమ్మని రాస్తే స్వయంగా వస్తాననీ రాశాడు గోపాలం. కమల ఉత్తరం చదివింది. పూర్తిగా చల్లారిపోయిందనుకున్న కమల హృదయంలో మళ్ళీ ఎక్కడో చిన్న నిప్పురవ్వ రగులుకుంది. వేడి బయలుదేరింది. ఆవేడికి మనస్సు మళ్ళీ పనిచేయసాగింది. వేడి క్రమంగా హెచ్చింది. ఆలోచనా, ఆవేశము, అభిమానమూ తిరిగి జోరుగా పనిచేయడం మొదలుపెట్టాయి. అన్నగారి ఉత్తరం పెట్టెలో పడింది. దానిమీద క్రియ శూన్యమని నిశ్చయమైపోయింది. "ఏమిటి తనపరిస్థితి? తానేం చేస్తున్నట్లు? తాను నిజంగా బ్రతికి ఉన్నట్లేనా? తన ఆశయాలూ, ఆదర్శాలూ, అభిలాషలూ అన్నీ ఏమైపోయాయి? ఇలా జీవితం గడుపుతుంటే బహుశా ఏ ఒడుదుడుకులూ ఉండక పోవచ్చును. జీవితం సాఫీగా సాగిపోతుంది. కాని ఇలా ఏడాది బ్రతికినా పదేళ్లు బ్రతికినా, నూరేళ్లు బ్రతికినా ఏమిటి తేడా? ఏమిటి ప్రయోజనం? తనకూ పశువుకూ తేడా ఏమిటి? యజమాని వేసే మేత తింటుంది పశువు. పాలిస్తుంది. పిల్లల్ని కని కాలం చెల్లిన తరువాత కసాయిఖానా కిచ్చివేయబడుతుంది. అంతేనా? తాను మాత్రం ఏమిటి? దయాదాక్షిణ్యాలమీద ఆధారపడేకాదూ బ్రతకడం. సమస్త భోగాలూ ఉన్నాయి కాని జీవితంలోని ముఖ్యమైన విలువలు దూరమైపోయాయి. ఏది తన వ్యక్తిత్వానికి కవసరమో, ఏది తన ప్రాణంతో సమానమో అది లేనప్పుడు ఎన్ని భోగాలుంటే మాత్రమేం? తను పంజరంలో చిలుక—బంగారు పంజరంలో చిలుక!" ఇది తలచుకునేసరికి కమలకు ఉక్కిరి

---

**అద్భుత హాస్యకథలు**

ఇండియా, అమెరికా, రష్యా, ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలయిన అనేక దేశములలోని నవ్వు పుట్టించే చిన్న చిన్న హాస్యకథలన్నీ తెలుగులో "అద్భుత హాస్యకథలు" అని ప్రచురించాము. దీనిలోని ప్రతికథ కడుపుబ్బ నవ్వించును. పిల్లలు, పెద్దలు చదివి ఆనందించతగిన పుస్తకము. వి. పి. పోస్టు ఖర్చులతో సహా రూ. 3-10-0 మాత్రమే. దేశసేవ ప్రచురణలు, ఏలూరు అనే అడ్రసుకు, మీకుకూడ ఒక పుస్తకం పోస్టుద్వారా పంపమని ఉత్తరం వ్రాయండి.

---

ఉక్కిరి అయినట్లనిపించసాగింది. ఒడ్డున పడ్డ చేపలా కొట్టుకోసాగింది. ఈ బంధనం నుంచి బయటపడాలి. వెళ్లి పోవాలి. ఎక్కడికో! తరువాత ఏమవుతుందో? అయినా వెళ్ళిపోవాలి ఆ ప్రయత్నంలో ప్రాణం పోయినా సరే!

అప్పటినుంచి కమలకు ఇక్కడినుంచి తప్పించుకు పోవాలనే ధ్యాస తప్ప మరొకటి లేదు. ఎల్లప్పుడూ అదే ఆలోచిస్తోంది. ఉపాయాలాలోచిస్తోంది. ఆ వేళ తెగించి వేసింది. రాజారావు మరొకరింటికి వెళ్లాడు. స్నేహితులు రాజారావును చేతులుపట్టుకొని లాగుకు పోయారు. కమల రాత్రి నిద్రపోలేదు. పారిపోయేందుకు పథకమాలోచిస్తూ కాలంగడిపింది. తెల్లవారు జాము మూడున్నర అయింది. బస్సు హారన్ వినిపిస్తోంది. మొదటి మూడు కార్లకు పోతే మొదటి లాంచి అందుతుంది. మూడో కారుకు పోవడమేమంచిది తన తరువాత వెదకడానికి ఎవరువచ్చినా మొదటిలాంచిదొరకదు. మూడో కారు నాలుగున్నరకు బయలుదేరుతుంది. మూడింటికి లేచి కమల తన బట్టలు తీసుకుంది. భర్త పెట్టిన చీరలు అక్కడే విడిచి వేసింది. తను కొన్నవీ, అన్నగారు పెట్టినవీ మాత్రమే తీసుకుంది. భర్త పెట్టిన నగలన్నీ తీసి దిగ బెట్టిన చీర మడతల మధ్య పెట్టి వేసింది. తన కదివరకున్న ఒంటిపేట గొలుసూ, చేతి గాజులూ, కమ్మలూ ఉంచుకుంది. తన దగ్గర ఉన్నది పదిహేను రూపాయిలే. అవే తీసుకుంది. భర్తదంటూ ఒక పూతిక పుల్లయినా తీసుకుపోకుండా జాగ్రత్తగా చూసుకుంది. అంతా సరిచేసుకొని కిటికీ దగ్గరకు పోయి చూసింది. కృష్ణపక్షపు రాత్రుల్లు. కారు చీకటి. అంతా నిశ్శబ్దంగా ఉంది. అప్పుడప్పుడు రోడ్డుమీద రెండెడ్ల బండ్లు మాత్రం పోతూ ఉన్నాయి. నౌకర్లు నిద్రపోతున్నారు. ఎక్కడా సంచలనం లేదు. లేచి తలుపు వగ్గరకు వెళ్ళింది. భయంవేసి వెనక్కి వచ్చింది. మళ్ళీ ధైర్యం తెచ్చుకొని తలుపు తీసుకొని దొడ్లోకి పోయింది. వీధి వైపుకు పోవడం ఆమెకు అపాయకరంగా తోచింది. దొడ్డివైపు పోతే ఎవరూ ఎదురు పడరు అని మల్లె మొక్కలూ, గులాబిమొక్కలూ ప్రక్కనుంచి ఆగుతూ చూసుకుంటూ పోయింది. దొడ్డి తలుపు తాళంవేసి ఉంది. కాళ్లు చల్లబడ్డాయి. ఏమీ తోచలేదు. ఏం చేయాలి? గోడ చాలా ఎత్తు. తను ఎక్కలేదు. మరి ఏమి చేయాలి? మళ్లా ఇంట్లోకి వెళ్ళి తాళం చెవి తేవలసిందే. మళ్ళీ ఇంట్లోకి పోవడమే! పచ్చివంతపని! అయినా తప్పనిసరి. వెనక్కి తిరిగివెళ్ళి ప్రాణాలు బిగపట్టుకొని తలుపుతీసి లోపలకు వెళ్ళి తాళం చెవుల గుత్తి తీసి బయటకు వచ్చింది. తాళం చీరతోపట్టుకొని చప్పుడు కాకుండా చెవి తిప్పింది. మెల్లగా గడియతీసి తలుపు తెరచి బయటికి నడచింది. తలుపుదగ్గరగా పెట్టింది.

అవతల అంతా కటిక చీకటిగా ఉంది. అన్నీ పొదలూ, ముళ్లడొంకలూ. పగలే పాములు తిరిగే ప్రదేశం. ఏ త్రాచుపామో ఎదురైతే! ఏ కట్ల పురుగో కాలిక్రింద పడితే! అయినా ప్రాణం ఉగ్గబట్టుకొని ముందుకు నడవసాగింది. గోతులూ గొప్పులూ. ఏమీ కనుపించడంలేదు. రెండు మూడుసార్లు క్రిందపడింది. కాళ్లనిండా ముళ్లూ ఎండుపుల్లలూ గుచ్చుకుంటున్నాయి. కంగారులో చెప్పులు తొడుగుకు రావడం మరచిపోయింది. బాధపడుతూనే పోయి మెల్లగా మెయిన్ రోడ్డుచేరుకుంది. తలమీద చీర కప్పుకొని, చీకటి పంచనే నడచి వెళ్లి బస్సుస్టాండు చేరుకుంది. తను బస్సుఎక్కి, బస్సు కదిలేవరకూ ఎవరూ రాకుండా ఉండాలని కోరుకుంటూ వెంటనే బస్సు ఎక్కక ప్రక్కన ఒక కొట్టు నీడలో నిలబడి ఉంది. మూడో బస్సు జనం నిండుతున్నారు. బస్సు కదిలేటట్లుండగా కమల త్వరగా ముందుకు పోయి బస్సు ఎక్కింది. తలవంచుకొని కూర్చుంది. టిక్కెట్టు డబ్బు ఇచ్చింది. బ్రతికాంరా భగవంతుడా అనుకుంది. కాని బస్సు కదలబోతూండగా మరికొందరు జనం వచ్చి ఎక్కారు. వారిని సాగనంపడానికి వచ్చినవారిలో కమల తన భర్తకోసం అప్పుడప్పుడు వచ్చే మనిషిని చూసింది. భయంతో తలవంచుకొని ముడుచుకొని కూర్చుంది. కాని ఆ మనిషి కమలను చూడనేచూశాడు. ఏదో అనుమానం తట్టినట్లుంది ఆమెకేసి అదేపనిగా చూడసాగాడు. ఇంతలో బస్సు కదిలిపోయింది. ఆ మనిషి అక్కడే నోరుతెరచుకొని నిలబడిఉన్నాడు. కమల గుండె వేగంగా కొట్టుకుంటోంది వెళ్ళి చెపుతాడేమో. వెనక కారులో వస్తారేమో? ఎలాగో తాను మొదటి లాంచిలో పడితే చాలు. బస్సులో ఎవరితోనూ మాట్లాడడం ఇష్టంలేక మొగం వెలుపలికి పెట్టుకుని కూర్చుంది. బస్సు పోతోంది. కాని మరోశబ్దం వినిపించినప్పుడల్లా కమల ఉలిక్కిపడుతోంది. బస్సు బొబ్బర్లంక చేరుకుంది.

తెరపినబడ్డ ప్రాణంతో కమల దిగి లాంచి రేవుకు వడిగా నడిచింది. లాంచిలో కూర్చుంది. లాంచి త్వరగా బయలుదేరితే బాగుండును అని జపిస్తూ కూర్చుంది. కాని

**'దానికేం భాగ్యం!'**

"ఒక్క పన్ను ఊడతీసినందుకు ఐదు రూపాయలిస్తుంటారా? దారుణం. రెండు క్షణాలుకూడా పట్టలేదే?"

"దానికేముంది. ఈ సారికిలా కానివ్వండి. పక్క పన్ను రెండు గంటలసేపు పట్టేలా ఊడదీస్తాను లెండి."

లాంచిమనిషి "ఇంకా జనం ఉంటే త్వరగా రండోహోయ్. లాంచి బయలుదేరుతోందోహోయ్" అని అరుస్తూనే ఉన్నాడు. ఆఖరికి లాంచి బయలుదేరింది. అప్పుడే ఒడ్డుమీద కొందరు జనం పరుగెత్తుకు వస్తున్నారు "ఆపండి ఆపండి" అంటూ. కాని లాంచి అప్పటికే నదీప్రవాహంలోకి పోవడంవల్ల వెనక్కి తిప్పడానికి వీలులేకపోయింది. ఒడ్డుమీద జనంలో రాజారావును, గోవిందాన్ని, రౌడీ ఆకారపు మనిషినీ కమల గుర్తించింది. వాళ్లు లాంచీలో ఆడవాళ్లు కూర్చునే వైపుకే తీక్ష్ణంగా చూస్తున్నారు. తనను రాజమండ్రికికూడా వెంబడిస్తారా? భారం భగవంతుడిమీద వేసి కూర్చుంది కమల. లాంచి రాజమండ్రీ చేరుకుంది. కమల అన్నగారింటికి పోదలచుకోలేదు. ఈ పరిస్థితుల్లో వెళ్తే అన్నగా రాదరిస్తాడా? పైగా అలా వెళ్తే రాజారావు చేతిలో పడడమే అవుతుంది. అందువల్ల బండిమీద గోదావరిస్టేషనుకు వెళ్ళింది. టికెట్టు తీసుకుంది కాని బండి రావడానికి ఇంకా గంటపైన టైముందని తెలిసి కమలకు నీరసం వచ్చింది. ఈలోగా వాళ్లు వచ్చేస్తారేమో! ఆ గంటలో ప్రతిక్షణమూ ఒక యుగంగా గడుపుతూ కూర్చుంది. చివరికి బండి వచ్చింది. వెళ్ళి ఆడవారిపెట్టెలో కూర్చుంది. గార్డు విజిల్ ఊదాడు. బండి కూత వేసింది. కమల ప్లాట్ ఫారంమీద రాజారావును గోవిందుగాడువగైరాలనుచూసి తలదించేసుకుంది. బండి కదిలింది. కమల వాళ్లు కూడా బండి ఎక్కగలిగారేమో ఏ స్టేషనులోనయినా తనని పట్టుకుంటారేమోనని భయంతో ముసుగు తీయకుండా ముడుచుకు కూర్చుంది.

(ఇంకా ఉంది.)

# బాలసాహితి

గాబా అనే తోటమాలి స్వర్గలోకంలో నివసించాలని గాఢంగా అభిలషించేవాడు. పసితనంనుంచి అందుకై కలలు కన్నాడు. అయితే అక్కడకు వెళ్ళడం ఎలా? స్వర్గలోకానికి ఈ స్థూలదేహంతో వెళ్ళడం అసాధ్యమని ఎవరైనా చెప్పితే "అది వట్టి మూర్ఖత. నేను నేనుగానే వెళ్లాలి. నా వెంట నేను అభిమానించే వాళ్ళంతా రావాలి" అనేవాడు.

పుచ్చపువ్వులా వెన్నెలకాస్తున్న పూర్ణిమనాటిరాత్రి ఒకపెద్దజంతువు దేవాలయ ప్రాంగణంలోని అరటి తోటలో తిరుగుతూవుండడం గాబా చూశాడు. అతను ఆ తోటకాపరి కనుక వెంటనే ఒక పెద్ద కర్ర తీసుకొని "ఓసి! క్షుద్రజంతువా! ఎందుకున్నావు అక్కడ? ఈ తోట పవిత్ర దేవాలయానిదని నీకు తెలియదా ?" అని పెద్దగా అరుచుకుంటూ ఆ తావుకు పరుగుతీశాడు.

ఆ జంతువు గాబా అరుపులను లక్ష్యపెట్టకుండా తోటవెంబడి తిరుగుతూనే వుంది. అది ఒక తెల్లని ఏనుగ! ఎంత తెల్లగా వుందంటే హిమాలయపర్వతశిఖరాగ్రంమీద కురిసే మంచు అంత తెల్లగా వుంది. దాని తొండం వెండి స్తంభంలా, దంతాలు పెద్దవిగా, అందంగా నోరు ఎర్ర గన్నేరులా, చెవులు పెద్ద దంతపు విసనకర్రల్లా, కళ్లు తళతళ మెరిసే వజ్రాల్లా వున్నాయి.

గాబా ఆ జంతువువంక ఆశ్చర్యంగా చూశాడు. తెల్లని ఏనుగలు స్వర్గలోకానికి చెందుతాయనీ, ఏదో ఒక ప్రత్యేక కార్యంపై భూలోకానికి వస్తాయనీ, మానవుడు వాటిని దర్శించడం శుభసూచన

కె. రామచంద్రరావు

అనీ పురాణగాథలలో చదివిన విషయం అతనికి జ్ఞాపకం వచ్చింది. "దీని అర్థం ఏమైవుంటుంది? ఈ తెల్లఏనుగ ఎందుకు వచ్చివుంటుంది? నా ప్రార్థనలను భగవంతుడు ఆలకించి ఈ నిర్భాగ్య గాబాను స్వర్గలోకం తీసుకురమ్మని ఈ తెల్ల ఏనుగను పంపించాడా?" మొదలైన ప్రశ్నలు ఉదయించాయి.

"ఓ గజేంద్రమా! నా శ్రమ ఫలితమైన ఈ తోటను నాశనం చెయ్యకు. ఈ ఫలములన్నీ దేవునికై ప్రత్యేకించబడినాయి" అన్నాడు ఏనుగను ఉద్దేశించి.

ఆ తెల్లఏనుగ అతని వంకచూసి అతనివైపు కదిలి అతనిని భయపెట్టసాగింది. అయితే గాబా భయపడి పారిపోలేదు. పైగా ఆ ఏనుగముందు మోకరిల్లి "జీవజాలంలో కెల్ల సౌందర్యమైనదానా! నీ దర్శనం వలన నా జన్మపావనమైంది. నీకు ప్రణామములు" అన్నాడు చేతులు జోడించి.

తీవిగా ఆ ఏనుగ "నీ కోరిక ఏమి?" అంది. గాబా లేచి నిలబడి "నేను ఈ జీవితంతో విసిగి విసిగి వేసారిపోయాను. స్వర్గలోకంలో జీవించాలనే కోరికగా వుంది' అన్నాడు.

"అయితే స్వర్గలోకంలో ఆనందమయ జీవితం గడిపేందుకు నీవేమి చేశావు? నీ అర్హతలేమి? నువ్వు కనీసం దేవాలయ అర్చకుడవు కూడా కాదే" అంది ఏనుగ ఘీంకరిస్తూ.

"నా మొర ఆలకించమని ప్రార్థిస్తున్నాను. నా జీవితం అంతా ఈ తోట సంరక్షణకు వెచ్చించాను. ఈ స్వామికి అందమైన పూవులను

# స్వర్గారోహణ

పూయించాను. ఈ దేవుని ఆరగింపుకు అనేకపండ్లను పండించాను. నే నెవరికి అపకారము చెయ్యలేదు" అన్నాడు గాబా.

"బాగుంది. నేను తిరిగి పౌర్ణమి నాడు భూలోకానికి వస్తాను. నాకోసం వేచివుండు. స్వర్గలోకానికి ఎగిరిపోయేటప్పుడు నా తోకను గట్టిగా పట్టుకుని నా వెంబడిరా. అర్థమైందా?" అని హెచ్చరించింది ఏనుగ.

గాబా ఆనందం పట్టలేకపోయాడు. వంగి నమస్కరించి పండిన అరటిపండ్ల అత్తలమును స్వీకరించమని అందిచ్చాడు. ఏనుగ వాటిని ఆరగించి "నువ్వొక్కడవు స్వర్గలోకం వచ్చి ఏమి చేస్తావు?" అని అడిగింది.

"ఒక్కడినా? ఒక్కడినే ఎందుకు వస్తాను? అతివాగుడుగల భార్యను, పెంపుడు కోతినీ నేను విడిచిరాను" అన్నాడు గాబా.

ఏనుగ గట్టిగా నవ్వి "అయ్యో! మానవుడా! నేను ఇందరనూ ఎలా తీసుకు వెళ్ళగలను?" అని ప్రశ్నించింది.

"నువ్వు తీసుకు వెళ్ళడానికి అనుమతిస్తే ఆ ఏర్పాట్లన్నీ నేను చేస్తాను. నా భార్య నా నడుం పట్టుకుంటుంది. కోతి నా మెడ పట్టుకుంటుంది" గాబా మాటలకు ఏనుగ ఆశ్చర్యపడింది. చివరకు అనుమతించింది. అతను తన కృతజ్ఞతను వెల్లడించేనరికే ఆ ఏనుగ స్వర్గాభిముఖంగా ఎగిరిపోయింది. సంభ్రమాశ్చర్యాలతో గాబా చూపు కందిన మేరకు అటే చూస్తూ నిలబడిపోయాడు.

అనంతరం ఇంటికి పరుగు పరుగున వెళ్ళి భార్యతో వైకుంఠ యాత్రను గురించి సవివరంగా చెప్పాడు. భర్త మాటలకు ఆమె విస్తుపోయింది. తన భర్తకు మతి చలించిందేమో అనుకొంది.

"ఈ అవకాశాన్ని మాత్రం నేను జారవిడుచుకోను. నువ్వు నా వెంట రావా? సరే! కోతి వస్తుంది చాలు" అన్నాడు గాబా.

కొద్దిక్షణాలుపోయాక ఆమె తన సుముఖతను వెల్లడించింది. కాని భర్త పొందినంత ఆనందాన్ని ఆమె పొందలేకపోయింది. ఈ జీవితంలోని సౌఖ్యాలనన్నిటినీ ఆ స్వర్గలోకంలో పొందలేనేమోనని ఆమె భయం. గాబా కోరికపై ఈ వైకుంఠయాత్ర ఏర్పాట్లు అన్నీ రహస్యంగా జరగాలనే నిర్ణయానికి వచ్చారు యిద్దరూ.

అయితే ఆ అతివాగుడు స్త్రీ ఇటువంటి శుభవార్తను తన బంధువులకు చెప్పకుండా ఎలా వుండగలదు? తన ముసలి అత్తనుంచి, మేనల్లుళ్ళు, మేనకోడళ్ళనుంచి, గౌరవించే గుడిపూజారినుంచి కలవు

బాలగేయం:

# ఎదురు ప్రశ్న

అలపర్తి వెంకటసుబ్బారావు

'రామం' అను బాలు డొకడు
రామదండు స్థాపించెను!
తుంటరీండ్ర తోడగూడి
కొంటెపనులు చేయసాగె!

గ్రామజనం ఈ విషయం
రామం తండ్రికి చెప్పగ,
"మది నాటగ ఒక్కమాట
మానవునకు చాలుగదా!

"వీలుజూచి బుద్ధి జెప్ప
వలె"ననుకున్నాడు తండ్రి!
కాని - వీలుదొరకలేదు.
కడకు ఒక్క దివసంబున -

"నెరిసె కొన్ని వెండ్రుకలివె!
నీ తలలో చూడు! నాన్న!
తెలియజెప్పు వెండ్రుకేల
తెల్లబడునో వివరముగా?"

అని, రామం ప్రశ్నించెను!
అపుడు - తండ్రి, బుద్ధిజెప్ప
అదనిదియని మదిదలంచి
అనియె నిట్లు కొడుకుతోడ;

"కొడుకు జేయు ప్రతీ ఒక్క
కొంటెపనికి నా తలలో
తెల్లబడెను ఒక వెండ్రుక
కల్లగాదు నిజము బాబు!"

"అయితే మరి, తాత కేల!
అన్నికురులు తెల్లబడెను!
కొంటెపనులు నీవుజేసి
ఉంటివేమొ! ఎక్కువగా!"

అని, రామం ఎదురు ప్రశ్న
అడిగినాడు - అంత...తండ్రి
గుక్క త్రిప్ప కొనగలేక
పక్కున ఒక నవ్వు నవ్వె!

## ★ స్వర్గారోహణ ★

పుచ్చుకోకుండా ఎలా వెళ్లగలదు? తమకు ఇన్ని సంవత్సరాలుగా పాలు, పెరుగు, నూనె, బట్టలు యిచ్చిన గ్రామస్తులు ఏమనుకుంటారు? పోనీ తన భర్త దేవాలయ ఆరామానికి చేసిన సేవకు మెచ్చి భగవంతుడు ఒక తెల్లఏనుగను ఆ భక్తులను తీసుకు రమ్మని పంపించాడని ఎందుకు చెప్పకూడదు? ఈ సామాన్యప్రజలు అసూయపడతారేమో! పోనీ, పడనీ; ఏంపోయింది?

ఆ పూర్ణిమనాటి రాత్రి తన బంధుమిత్రులను తమ వెంట స్వర్గలోకం తీసుకువెడతానని ఆమె వాగ్దానం చేసింది.

నిండు పున్నమచంద్రుడు చల్లని కిరణాలను ప్రసరిస్తున్నాడు. గాబా యింట్లో కోలాహల మధికమైంది. తోటలో దూరంగా తెల్లఏనుగ ప్రత్యక్షమైంది.

దేవాలయ అర్చకులు గాఢ సుషుప్తిలో వున్నారు. చప్పుడు కాకుండా వైకుంఠ యాత్రికుల జట్టు తోటలోనికి ప్రవేశించింది. అంతమంది ప్రజలను చూసేసరికి ఆ గజేంద్రునికి ఆనందమైంది. గాబాకు, అతని భార్యకు వీడ్కోలు చెప్పడానికే ఇంతమందీ వేంచేశారని ఆ ఏనుగ భావించింది.

ఆ ఏనుగ మోకాళ్లపై వంగగానే గాబా దాని తోకను గట్టిగా పట్టుకున్నాడు. కోతి అతని మెడను పట్టుకుని భుజాలపై కూర్చుంది. గాబా భార్య అతని నడుమును, ఆమె ముసలి అత్త ఆమెను, ఆ అత్తను మేనల్లుడు, ఆతనిని... ఇలాగే అంతా ఒకరిని పట్టుకొని ఒకరు వ్రేలాడుతూ గొలుసులా వున్నారు.

వైకుంఠ యాత్రికుల జట్టును తీసుకుని తెల్ల ఏనుగ అంతరిక్షానికి ఎగిరింది. హిమాలయ శిఖరాలను అధిగమిస్తూండగా ఇక తమ గమ్యస్థానానికి చేరుతున్నామని సంతోషించాడు గాబా!

ఈలోగా జట్టువారిలో కబుర్లు మొదలైనాయి. కోతి మాత్రం నిశ్శబ్దంగా వుంది. గాబాను పట్టుకొని నిద్రలో మునిగింది అది. మిగిలినవారు తమ భవిష్యజ్జీవనం గురించి చర్చించ నారంభించారు.

"నాకు చెప్పండి, స్వర్గలోకంలోని ప్రజలు మనవంటి సామాన్యులను అభిమానిస్తారా?" అని అడిగింది గాబా భార్య.

"ఓసి పిచ్చిదానా! ఎన్నిసార్లు నీకు చెప్పలేదు. ఆ లోకంలోని ప్రజల రీతులే వేరుగావుంటాయని?" అని సమాధానం ఇచ్చాడు గాబా.

కొంతదూరం పోయాక తిరిగి ఆమె ప్రశ్నించింది "ఈ విషయం చెప్పండి. నేను యింటివద్దలాగే అక్కడకూడా కష్టపడి పని చేయాలా?"

"మనం ఏమీ శ్రమపడనక్కర్లేదు. అక్కడ డబ్బుకూ, గుడ్డకూ ఇబ్బంది వుండదు. నువ్వు చివరకు వంటకూడా చెయ్యనక్కర్లేదు. దేవకన్యలే వండిపెడతారు" అని హామీ యిచ్చాడు గాబా.

మరికొంత దూరం వెళ్ళారు.

### ఆలస్యం

తండ్రి: ఏవిట్రా వెధవా. ఇలా రైలు దిగానో లేదో, అప్పుడే డబ్బులిమ్మంటా వేమిటి? హాన్నా!

సుపుత్రుడు: అది కాదండి. మీరు వచ్చిన అరగంటకి అడుగుదా మనుకున్నా. తీరా చూస్తే, రైలే అరగంట లేటుగా వచ్చింది.

"ఈసారి చెప్పండి. అక్కడ పెద్ద రకం చేపలు దొరుకుతాయా అని అత్త అడుగుతూ వుంది" అని అడిగింది గాబా భార్య.

"ఓసి నీచురాలా! అలాంటి అసహ్యమైన వాటిగురించి ఆలోచించకండి మనం స్వర్గలోకం వెళుతున్నాం" ఈ హెచ్చరికతో ఆమె మౌనం వహించింది. ఇంతలో ఆమె మేనల్లుడు "మామా! అక్కడ గొఱ్ఱెలుంటాయా?" అని అడిగాడు.

"నోరు ముయ్యి"అని అరిచాడు గాబా.

కాని ఎంతో కాలం గాబా భార్య మౌనంగా వుండలేక పోయింది. "మరొక్క విషయం అడుగుతాను దయచేసి చెప్పండి. అక్కడ కర్బూజా పుచ్చకాయలు దొరుకుతాయా?" అని అడిగింది.

"మాట్లాడకు పిచ్చిదానా! అక్కడ తప్పక దొరుకుతాయి. అవి అంటే దేవతల కెంతో ఇష్టం" అని విసుక్కున్నాడు గాబా.

ఆమెకు పరమానందమైంది. ఆశ్చర్యంతో "ఎంత పెద్దవి

ఉంటాయి?" అని ప్రశ్నించింది కుతూహలం ఉట్టిపడగా.

ఈ పర్యాయం గాబా సహనం కోల్పోయాడు. కోపంతో "ఇంత పెద్దవి మూర్ఖురాలా!" అని పట్టు విడిచి రెండు చేతులూ బార చాచాడు.

ఇక ఆపైన ఏమైందో ఊహించుకోండి! వైకుంఠయాత్రికుల జట్టుకు ఎట్టి గతి పట్టింది?

ఆ ప్రయాణీకులందరూ భూపతనమైనారు. కాని కోతిమాత్రం గాబా పట్టువిడిచి నంతనే త్రుళ్ళిపడి ఏనుగపై కురికింది. అందువల్ల అది స్వర్గలోకం ప్రవేశించ గలిగింది. మిగిలిన వారందరూ ఆ ఏనుగదయ వలన దేవాలయం తోటలో సురక్షితంగా నేలకూలారు. ఆ క్షణం నుంచీ గాబా విచారగ్రస్తుడైనాడు. స్వర్గలోకం వెళ్ళలేక పోయానని కంటే, తను ఆప్యాయంగా పెంచుకున్న కోతి తనను విడిచి వెళ్ళిపోయిందే అని. ఆ విచారంతోనే ప్రతిదినం దేవాలయానికి వెళ్ళి భక్తిశ్రద్ధలతో పూజ చేశాడు తన కోతిని తన కిప్పించమని.

ఒకరోజు రాత్రి కోతి కిచకిచ ధ్వని విని గాబా ఆత్రంతో తలుపు తెరిచాడు. కోతి ప్రత్యక్షమైంది.

"ఏమమ్మా! తిరిగివచ్చావా?" అన్నాడు గాబా ఆప్యాయంగా. కోతి తల ఆడించింది.

"స్వర్గలోకం ఎలా వుంది?"

"అక్కడ కాయలూ లేవు ఏమీ లేవు. అరటిపళ్ళూ లేవు, కర్బూజా పుచ్చకాయలూ లేవు" అంటూ కోతి చటుక్కున గాబా పైకురికి అతని చేతుల్లో యిమిడిపోయింది.

(మూల కథ : ఎన్. గంగూలీ) ★

# అమాయకులు

'దిలీప్'

(బెంగాల్‌లో చెప్పుకొనే ఒక కథ ఆధారంగా)

శ్రీనగరగా అపురూప నగరంలో విక్రమవర్మ, విజ్ఞాని, సునందుడు, మల్లయ్య అనే నలుగురు స్నేహితులు వుండేవారు. విక్రమవర్మ రాజకుమారుడు – విజ్ఞాని మహామంత్రి ముద్దులకొడుకు – సునందుడు పురోహితుని పుత్రుడు – పోతే, మల్లయ్య రాజుగారి మంగలి కొడుకు. వీళ్ళ నలుగురికీ వ్యత్యాసం లేకుండా స్నేహం ఎలా కుదిరిందో ఎవరికీ తెలీదు. కాని నలుగురూ ప్రాణస్నేహితులనే చెప్పుకోవాలి.

ఒకానొకరోజు, యీ నలుగురూ వీధివెంబడి పోతూవుంటే ఒక అనామకుడు వీళ్ళకి యెదురై ఒకే ఒక్క నమస్కారం పారేసి తన దారిని తాను పోయాడు. కాని వీళ్ళకి మాత్రం పెద్ద సమస్య పట్టుకుంది ...ఎవరికి నమస్కరించాడు? అని—

"నేను యీ నగరానికి అధిపతి అయిన రాజుగారి సుపుత్రుడనని నాకు నమస్కారం చేశాడు..." అన్నాడు విక్రమవర్మ గర్వంతో. కాని, అది తక్కినవాళ్ళకి సంతృప్తి కలిగించలేదు.

"కాదు రాకుమారా! నేను మహామంత్రి కుమారుణ్ణని తెలుసు వాడికి. అందుకే నాకు వందనం చేశాడు" నవ్వుతూ అన్నాడు విజ్ఞాని. సునందుడుమాత్రం తక్కువ తిన్నాడా!

"అదేం! మీ రిద్దరూ పొరబడ్డారు. మా నాన్న వాళ్ళింటికి కూడా పురోహితులే. మా నాన్న వెంట అప్పుడప్పుడు నేనూ వెళ్తూండే వాణ్ణి. ఆ పరిచయంవల్ల నాకే నమస్కారం చేశాడు" అన్నాడు సునందుడు. వీళ్ళందరి మాటలు విన్న మల్లయ్య ఫక్కున నవ్వాడు.

"బావుందండోయ్ మీ అందరి వరస! మీ రనుకున్న వేమీ సరైనవి కావు. అసలు వాడు మా బంధువు. నే నెక్కడ కన్పించినా చిన్న నమస్కారం పారేస్తాడు. ఆ అలవాటు ప్రకారం యీవాళా నమస్కరించాడు" అన్నాడు మల్లయ్య అతి సహజంగా. అయితే నేం వాడి మాటలు నమ్మే పరిస్థితిలో ఎవరూ లేరు.

"మనలో మనకి తగు వెందుకు? యీ సమస్య ఒకంతట పరిష్కారమవదు...యీ నగరమంతటికీ తెలివైన పండితుడు పిచ్చయ్యశాస్త్రి కదా! అతనిదగ్గరికే వెళ్ళి యీ మన అనుమానం తీర్చుకుందాం పదండి" అన్నాడు విక్రమవర్మ. అందుకు అందరూ సమ్మతించారు. నలుగురూ కలిసి పిచ్చయ్యశాస్త్రి యింటివేపు నడిచారు.

రాకుమారుణ్ణి, మంత్రికొడుకుని పిచ్చయ్యశాస్త్రి కొద్దిగా యెరుగును. అందుకని వాళ్ళిద్దర్నీ చూడ్డంతో ఆప్యాయంగా ఆహ్వానించి ఆసనాలు చూపించాడు. కాని, వాళ్ళు కూర్చోలేదు... తాము వచ్చిన పని వివరంగా చెబుతూ "ఎవరికి నమస్కరించాడా వ్యక్తి." ప్రశ్నించాడు రాజకుమారుడు. తక్కిన ముగ్గురూ సవినయంగా చేతులు కట్టుకుని పండితుని నోట యేమి వస్తుందోనన్న ఆత్రంతో అతనివేపే చూస్తున్నారు.

పిచ్చయ్యశాస్త్రి మాత్రం ఏం చెబుతాడు? సూటిగా కనిపిస్తున్న జవాబు ఒక్కటే అతనికి.

"రాకుమారుడవు కాబట్టి ఆ అర్హత నీకే వుంది రాకుమారా!" అన్నాడు. విక్రమవర్మ చిరునవ్వుతో తలెత్తి ముగ్గురికేసి చూశాడు. వాళ్ళు మాత్రం వూరుకుంటారా? అందరు ఆ నమస్కారం తమకే అన్నారు.

పిచ్చయ్యశాస్త్రికి యిప్పుడంతా అర్థమయింది. ఇంత చిన్న విష

యాన్ని యిలా పెంచుకోవటంలో వాళ్ళ తెలివితక్కువతనం బోధపడింది. ఒహరి నంటే తక్కినవాళ్లు ఒప్పుకోవటం లేదు. ఎలా పరిష్కరించటమా, అని క్షణం ఆలోచించి వాళ్లకి తగిన బుద్ధి చెప్పా లనుకుని "మీలో యెవరెవరికి వివాహాలయ్యాయ్?" అన్నాడు నవ్వుతూ.

"నాకు వివాహమయ్యింది" విక్రమవర్మ చప్పున అన్నాడు.

"నాకూ వివాహమయ్యింది" విజ్ఞాని అన్నాడు.

"నాకూను అయింది" అన్నాడు సునందుడు. మల్లయ్య ఒక్కడు మాత్రం మిగిలిపోయాడు. వాడు గిగులుతో :

"నాకింకా పెళ్లికాలేదండీ! మా అన్న కయ్యింది" అన్నాడు.

"సరే! వివాహమయిన మీ ముగ్గురూ మీ మీ అత్తవారిళ్లకి తక్షణం బయల్దేరి వెళ్ళి యీవేళ రాత్రి అక్కడుండి తెల్లవారంగానే బయల్దేరి తిన్నగా నాదగ్గరికి వచ్చి అక్కడ మీకు యేవిధమైన మర్యాదలు జరిగాయో చెప్పండి.. అప్పుడుగాని నేను తీర్పు చెప్పలేను" అన్నాడు శాస్త్రి.

"మరి, నా మాటండీ?" తనని మర్చిపోయాడేమోనన్న భయంతో అడిగాడు మల్లయ్య.

"నువ్వు మీ అన్నయ్య అత్తవారింటికి వెళ్ళు. వీళ్ళు వచ్చేవేళకే యెలాగన్నా నువ్వూ రావాలి... అప్పుడు యెవరికి నమస్కరించిందీ చెప్తాను" అన్నాడు పండితుడు. ఈ పద్ధతి నలుగురికీ నచ్చింది. వుత్సాహంతో పిచ్చయ్యశాస్త్రికి వందనాలు చేస్తూ ఎవ రిళ్ళకి వారు పోయారు.

*   *   *

మధ్యాహ్నం భోజనం ముగియగానే విక్రమవర్మ తండ్రివద్దకి పోయి తను అత్తవారింటికి తక్షణమే బయల్దేరుతున్నట్టు మనవి చేసుకున్నాడు...కొడుకు అకస్మాత్తు ప్రయాణానికి ఆశ్చర్యపోతూ కారణమడిగాడు. విక్రమవర్మ కారణం చెప్పదల్చుకోలేదు. తనకి వెళ్లాలని బుద్ధి పుట్టింది గనుక వెళ్తున్నానన్నాడు...ముద్దుల కొడుకు, ఒకే ఒక్క కొడుకూ అవటంవల్ల 'రాజుగారు యింకేం ఆటంకపర్చకండా పూఁ కొట్టి పరివారాన్ని తీసుకెళ్లమన్నాడు. "ఎవ్వరూ వద్దు నాన్నా! నేనొంటరిగానే వెళ్తాను" మారాం చేశాడు విక్రమవర్మ. రాజుకిదేం అర్థంగాక యెంతో బోధపర్చాడు. కాని లాభం లేకపోయింది.

"సరే నీ యిష్టం...త్రోవలో జాగ్రత్త...ఆఁ మళ్ళీ యెప్పుడొస్తావు?" అన్నాడు రాజు.

"రేపు వుదయం..."ముక్తసరిగా జవాబిచ్చి సంతోషంతో గంతులేస్తూ గుఱ్ఱపుశాలవేపు పోయాడు విక్రమవర్మ. కొడుకు చిలిపితనానికి లోలోన నవ్వుకున్నాడు రాజు.

నిజం చెప్పాలంటే విక్రమవర్మ అత్తవారి నగరం అట్టే దూరం లేదు. వీళ్ళ ప్రక్క రాజ్యమే! గుఱ్ఱం మీద ప్రయాణమయితే అయిదు గంటలు పడుతుం దంతే! అందుకనే కొడుకు ఒంటరిగా వెళ్తానన్నా వూరుకున్నాడు రాజు.

ఇలా వుండగా, అదే వేళకి

## 'జాలి లేదూ'

"ఎందుకు బాబూ ఏడుస్తున్నావు?"

"మా నాన్న సుత్తితో బొటకన వేలు చితక్కొట్టుకున్నాడండి."

"నా తండ్రీ. మీ నాన్నకి దెబ్బ తగిలిందని నువ్వేడుస్తున్నావా? ఎంత జాలిగుండె?"

"కాదండి. ముందస్తుగా, నాన్న 'అబ్బా' అంటే నవ్వాను. అప్పుడేమో నాన్న 'వెధవా' అని కొట్టాడండి."

విజ్ఞాని కూడా తన అత్తవారింటికి వెళ్తున్నట్టు తండ్రితో చెప్పాడు. మంత్రి, కొడుకు హఠాత్ప్రయాణానికి అచ్చెరువంది కారణ మడిగాడు. విజ్ఞాని అసలు కారణం చెప్పలేదు.

"ఇంతవరకూ పెళ్లయ్యాక ఒక్కసారి కూడా భార్యను చూడలేదు నాన్నా! అంతా అడుగుతున్నారు 'నీ పెళ్లాం యెలా వుంటుందిరా' అని. ఏం జవాబు చెప్తాను చెప్పండి...అదీగాక ఆమెని చూడాలని నాకూ మనసులో వుంది. మళ్లీ రేపు వుదయమే వచ్చేస్తాను" అన్నాడు విజ్ఞాని. కొడుకు అభిప్రాయం బాగుం దనుకున్నాడు మంత్రి.

"సరే అలాగే కానియ్...వట్టి చేతుల్తో వెళ్ళకూడదు గనుక చెట్టు కున్న అరటిపళ్ళగెల ఒకటి కోసి వీరయ్యచేత పట్టించుకు వెళ్లు... యిద్దరూ ఒకే గుఱ్ఱంమీద వెళ్ళిపోవచ్చు" అన్నాడు మంత్రి.

వీరయ్య అంటే వాళ్ళ యింటి

సౌకరు. వాడు తన వెంట రావటం విఘ్నానికి యిష్టం లేకపోయినా, అంటిపళ్లగెల పట్టుకుంటాడు కదా అని సమాధానపడ్డాడు. తక్షణం మంచిగుఱ్ఱం తీసుకుని వీరయ్యని వెనుక కూర్చోపెట్టుకుంటూ బయల్దేరాడు.

ఇక పురోహితునికొడుకు తండ్రి ఆజ్ఞతీసుకుని కాలినడకనే బయల్దేరాడు అత్తవారింటికి. ఔను మరి! అతడికి గుఱ్ఱం ఎక్కణ్ణించి వస్తుంది? మధ్య త్రోవలో ఫలహారం చెయ్యాలని కొన్ని అటుకులు ఒక మట్టి పాత్ర మాత్రం పట్టుకున్నాడు.

పోతే మిగిలినవాడు మల్లయ్య ఒక్కడే! వాడూ తండ్రితో చెప్పాడు వదినగారింటికి వెళ్తానని. మల్లయ్య తండ్రికూడా కాదనలేదు. "సరే వెళ్లు నాయనా! వదిన పిల్లలున్నారు గనుక యిదిగో ఈ అయిదు రూపాయలూ పట్టుకో! బజార్లో యేవో 'అవీ, ఇవీ' కొని పిల్లలకోసం తీసుకెళ్లు..." అంటూ అయిదు రూపాయలు మల్లయ్య చేతిలో పెట్టాడు.



మల్లయ్య బాగా ముస్తాబై వుత్సాహంతో బయల్దేరాడు.

విక్రమవర్మ సాయంకాలం అయ్యేసరికి అత్తవారి నగరు చేరుకున్నాడు. రాకుమారుడు పరివార సహితంగా కాకండా ఒంటరిగా రావటం చూసి అంతా ఆశ్చర్యపోయారు...కొందరు గుసగుసలాడుకున్నారు......అయినా యెవరూ పల్లెత్తు మాటనలేదు విక్రమవర్మ యెదురుగా......కాని చాటున యేమేమో అనుకొన్నారు. 'ఇదేం చోద్యం – రాజకుమారుడై వుండి హోదా కాస్తయినా లేకండా ఒంటరిగా సాధారణ మనిషిలా వచ్చేశాడే!' అని. ఇలా యేమేమో అనుకోవటం విక్రమవర్మ భార్య రుమాదేవి చూచాయగా విన్నది. భర్త వ్యవహారం ఆమెకి అట్టే నచ్చలేదు. అందుకే భర్తపై ఒకవిధమైన కోపం పుట్టుకొచ్చింది.

ఆరోజు రాత్రి రుమాదేవి చాల సేపటివరకూ విక్రమవర్మతో మాట్లాడకండా మౌనంగా, కోపంతో మూతి ముడుచుకుంటూ కూర్చుంది.

అర్ధరాత్రి అయ్యింది. రుమాదేవిఅలాగునే ప్రతిమలా కూర్చుంది. ఆమెకి దగ్గరసా కూర్చున్నాడు విక్రమవర్మ ప్రాధేయపడుతున్నట్లు. ఎంతసేపని అలా కూర్చుంటాడు? భార్యకి యెందుకోపం వచ్చిందో ఒకంతట అర్థం కాలేదు. మెల్లగా ఆమెదగ్గరికి వెళ్లి—

"కోపమొచ్చిందా రుమా?" అన్నాడు చివరికి ధైర్యంతో. రుమా

మేజస్ట్రేటు: నీకేమో డబ్బులోటు లేదంటావు. పోనీ, దొంగిలించిన ఈ హార్మోనీ వాయించడం వచ్చా అంటే అదీ రాదంటావు. మరెందుకు ఎత్తుకుపోయినట్టు?

ముద్దాయి: ఆ మాటకొస్తే అసలీ హార్మోనీ స్వంతదారుడికి కూడా ఏం రాదు తెలుసాండి!

దేవి తీవ్రంగా అతని వేపు చూసింది. విక్రముడు గుటకమింగుకున్నాడు.

"కోపం రాదూ మరి? పరివారం వెనక లేకండా ఒంటరిగా మీరు రావటం యెంతమంది యెన్నెన్ని అన్నారో మీకేం తెలుసు?" అవమానంతో బాధపడుతున్నట్లుగా అంది. భార్యకోపానికి అర్థం తెలిసినందుకు ఆనందించాడు. నిజమే. తను కొంత పరివారాన్ని వెంటేసుకు రావల్సింది.

"ఒంటరిగా యెలా రాగలిగారు?" అంది మళ్ళీ.

"గుఱ్ఱంమీద వచ్చాను. నా గుఱ్ఱం మహావేగంగా పరుగెత్తిందిలే!" సంతోషంతో అన్నాడు.

"గుఱ్ఱంమీదవచ్చారన్నమాట! గుఱ్ఱమంటే యేమిటండీ?" గుఱ్ఱమంటే తన కసలు తెలీదన్నట్లుగా మాట్లాడింది రుమాదేవి. నిజానికి ఆమె, భర్తను వేళాకోళం చెయ్యాలన్న అభిప్రాయంతోనే యీ ప్రశ్న వేసింది. లేకుంటే రాకుమారికి యేమిటి—గుఱ్ఱమంటే తెలీకపోవటమేమిటి? అయితే విక్రమవర్మ మాత్రం అది వూహించక నిజంగా

ప్రొఫెసర్ గారు: వీడొక్కడేనా కొడుకు?

తండ్రి: అబ్బే. ఇద్దరున్నారండి.

ప్రొఫెసర్: మొగా? ఆడా?

భార్యకి గుఱ్ఱం యెలా వుంటుందో తెలీదు గామోసు! అనుకున్నాడు. గుఱ్ఱమంటే యెలా వుంటుందో నోటితో వర్ణించటం చేతకాక రెండు చేతుల్నీ భూమి కానించి గుఱ్ఱం నడిచేటట్టు నడిచి ఆమెకు తెలియచేశాడు. భర్త అమాయికత్వానికి రుమాదేవికి నవ్వొచ్చింది. ఆమె చిన్నతనంలో పరిచారకుడు యిలాగే గుఱ్ఱంవలె వంగి నడుస్తూ ఆమెని వీపుపై కూర్చుండబెట్టుకోవటం జ్ఞాపకమొచ్చింది రుమాదేవికి?

"అయితే, ఒకవేళ గుఱ్ఱాన్ని వేగంగా పరుగెత్తించాలంటే యేం చేస్తారు?" అని అడిగింది రుమాదేవి.

"ఏముంది...చేతిలో కొరడా యెలాగూ వుంటుంది...కొడతాం.. లేదా రికాబ్బులతో నొక్కుతాం" అన్నాడు విక్రమవర్మ; అతడు అలా అనటమే తడవుగా రుమాదేవి అతని వీపుమీద కూర్చుని చేతులతో అతన్ని కొడుతూ వేగాన్ని హెచ్చించమని నవ్వింది. ఆ రాత్రంతా అదే విధంగా నవ్వులాటల్తో గడిచిపోయింది...తెలతెలవారింది...విక్రమవర్మ అలసిపోయాడు...అతని వళ్ళంతా పచ్చి నొప్పిగా వుంది. నడిచే పరిస్థితిలో కూడా లేడు...మామగారితో కూడా తను వెళ్ళిపోతున్నట్లు చెప్పకుండా ఒక్క భార్యతోనే చెప్పి, బ్రతిమలాడి ఆ మసకవెన్నెల్లో గుఱ్ఱం తీసుకుని తన నగరానికి తిరుగుముఖం పట్టాడు...

* * *

ఇక విజ్ఞాని యింటి నౌకరు వీరయ్యతో పాటు అత్తవారింటికి బయల్దేరాడని చెప్పుకున్నాం కదూ: ముందు కూర్చుని విజ్ఞాని స్వారీ చేస్తుంటే అతని వెనుక అరటిపళ్ళగెల పట్టుకుని కూర్చున్నాడు వీరయ్య. కొంతదూరం వెళ్ళిన తరువాత వీరయ్యకి దాహం వేసింది. గుఱ్ఱం దిగి మంచినీళ్లు వెదికి త్రాగటం బద్ధకమనిపించింది. అందుకని రెండు అరటిపళ్లు తిని దాహం తీర్చుకుని తొక్కలు పారేశాడు...అతడు తొక్కలు విసురుతూన్నప్పుడు విజ్ఞాని చూడ్డం తటస్థించింది. అతనికి మహాచెడ్డ కోపం వచ్చింది.

"ఏమ్ వీరయ్యా ఏమిటది? ఆ అరటిపళ్లు మా అత్తవారింటికి తీసుకెళ్తున్నాం గాని నువ్వు తినడానిక్కాదుగా! ఏం?" అంటూ వురిమాడు. వీరయ్య బిక్కచచ్చిపోయాడు.

"మరేం చేయనండీ. దాహం అపరిమితంగా వుంది. నాలుక పిడచగట్టుకుపోతోంది... అందుకే రెండంటే రెండు..." అని యింకా చెప్తుండగానే గుఱ్ఱం ఆపి వీరయ్య వేపు తీక్ష్ణంగా చూశాడు విజ్ఞాని.

"ఛీ! నోర్మూయ్...చెప్పడానికైనా సిగ్గులేదూ! దాహం వేస్తే అవే తినాలిగామోసు! నాకు మాత్రం దాహం వేయలేదూ... యెందుకు వూరుకున్నాను మరి? మనం వట్టిచేతుల్తో వెళ్ళకూడదు... ముఖ్యంగా నేను వట్టిచేతుల్తో వెళ్లను. ఈసారి యేమన్నా తిన్నావా, నేను వట్టిచేతుల్తోనూ, నగం గెలతోనూ వెళ్ళను గనుక నువ్వే నాబదులు వాళ్ళ అల్లుడుగా వెళ్లాలి...అప్పుడు నీకు తగిన శాస్తి జరుగుతుంది తెలుసా?" అన్నాడు విజ్ఞాని. వీరయ్య మరేం జవాబు చెప్పలేదు...గుఱ్ఱం మళ్ళీ కదిలింది. యజమాని అన్నమాటలు వీరయ్యకి భయం కంటె సంతోషం కలిగించాయి. నిజానికి నౌకరయినా వీరయ్య, విజ్ఞానికంటే యుక్తిపరుడూ, తెలివైనవాడూను; ఒక్క రాత్రికయినా తను మంత్రి కొడుకయితే యింకేం కావాలి? అన్న సంతోషం అతడాపుకోలేకపోయాడు...ఒక్క రాత్రి తను మంత్రి కొడుకవ్వాలంటే అరటిగెల ఒకపండు లేకుండా ఖాళీ చెయ్యాలి. యజమాని అన్నంత పనీ తప్పకండా చేస్తాడు...అనుకున్నాడు వీరయ్య విజ్ఞాని మనస్తత్వం, తెలివి తక్కువతనం యింతకుముందెన్నోసార్లు అవగాహన చేసుకున్నాడు. మరి! అందుకని విజ్ఞాని చూడకండా తిన గలిగినన్ని అరటిపళ్లు తిని మిగతావి త్రోవపొడుగునా ఒక్కొక్కటి విసురుకుంటూ, యెలాగవుతేనేం ఒక్కపండూ లేకండా చేశాడు.

విజ్ఞాని అత్తవారి వూరు పొలి

మేరలకి రావటంతో అరటిపళ్ళగెల సురక్షితంగా వుందా, లేదా, అని ఓమారు వెనక్కి చూశాడు. ఇంకే ముంది? ఒక్క పండూ మిగల్లేదు... విజ్ఞాని కోపం ఆపుకోలేకపోయాడు. తక్షణం గుఱ్ఱాన్ని ఆపి వీరయ్యని బలవంతంగా క్రిందికి లాగి—

"నేను యింతా చెప్తే చివరికి ఖాళీచేశావా? వట్టిచేతుల్తో యే ముఖం పెట్టుకుని వెళ్తాను? ఎంత అవమానం?

నువ్వే వెళ్లు...ఆ జరిగే పరాభవమేదో నీకే జరగనీ! వూఁ నీబట్టలు నాకివ్వు ... నా దుస్తులు నువ్వు వేసుకో...అలా చూస్తావేం? వూఁ కానీయ్..." అన్నాడు కోపంగా. ఆ సమయంలో విజ్ఞానికి అంతవరకే తట్టింది...తన నౌకరు తన వేషంలో తనభార్యదగ్గరికి వెళ్తున్నాడే! అన్న ఆలోచన కలగలేదు. వీరయ్యకి కావల్సిందేమిఁటి? భయపడుతున్న వాడిలా నటించి మెల్లగా తన దుస్తులు తీసి యజమానికిచ్చాడు. విజ్ఞాని తన దుస్తులు వీరయ్య కిచ్చి వాడి దుస్తులు తను ధరించాడు. క్షణంలో వీరయ్య 'విజ్ఞాని'అవగా, విజ్ఞాని 'వీరయ్య'గా మారాడు. మళ్ళీ ప్రయాణం సాగించారు.

విజ్ఞాని అత్తవారింటికి వెళ్ళటం యిదే మొదటిసారి. ఇంతవరకూ భార్యను పరికించి చూడలేదు. ఎప్పుడో వివాహం తరువాత ఒక్కసారి చూశాడు. ఇంతా భార్యను చూడాలని బయద్దేరినవాడు చివరికి నౌకరుని మంత్రికొడుకుగా మార్చాడు అంతా మర్చిపోయి.

అల్లుడు చాలాకాలానికి వచ్చినందుకు ఆయింట్లో వారంతా ఆనందించి విజ్ఞానివేషంలో వున్న వీరయ్యని ఆదరంతో లోనికి తీసుకు వెళ్లారు...అతడు వట్టిచేతుల్తో వచ్చినందుకు యెంతో పరాభవం జరుగుతుందనుకున్న అసలైన విజ్ఞాని నివ్వెరపోయాడు. కాని, అప్పుడు తనే 'విజ్ఞాని' అని చెప్పుకోలేడుగా! మరీ అవమానపడాల్సి వస్తుందనుకుని బాధపడ్డాడు. అంతకంటె చేయగలిగిందేమీ లేదు.

ఇంట్లోపలికి పోయింతరువాత వివేకవంతుడైన వీరయ్య ఒక తెలివైన పనిచేశాడు. అత్తని దగ్గరసా పిల్చి "చూడత్తయ్యా: నాతోవచ్చిన నౌకరుకి వంట్లో యేం బావుండలేదు...త్రోవలో రెండు వాంతులు కూడా అయినవి. అందువల్ల వాడికి మరి భోజన మేం పెట్టకండి...గుఱ్ఱపుశాలలో ఓమూల పక్క వేసి పడుకోమనండి...వాడి మతిగూడా స్తిమితమైంది కాదు...ఏం చెప్పినా నమ్మకండి." అన్నాడు ముందుగానే జాగ్రత్తపడుతూ. అత్తయ్య 'సరే' అంది.

కాని అతడి ఆశలన్నీ ఒక్కసారి కూలిపోయాయి. విజ్ఞాని భార్యకి రెండురోజుల్నుండి తీవ్రంగా జ్వరం వస్తూందని విన్నాడు చూచాయగా ... అత్తగూడా చెప్పింది. అమ్మాయికి జ్వరం ఒకపట్టున వదలకుండా వుందని. కథ అడ్డం తిరిగినందుకు వీరయ్య చాల విచారించాడు. యీ విషయం యెలా తెలిసిందో వీరయ్య వేషంలోవున్న విజ్ఞానికి తెలిసింది. అతడు తన అదృష్టానికి భగవంతుణ్ణి మనసులో ప్రార్థించుకున్నాడు.

ఆరాత్రి భోజనం పెడతారని యెంతోసేపు యెదురు చూశాడు విజ్ఞాని. కాని యెవరూ పిలవలేదు... చివరికి పడుకునే సమయంలో అత్తయ్యే వచ్చి:

"ఎలా వుందోయ్ వంట్లో వీరయ్యా! మీ యజమాని నీకు భోజనం పెట్టవద్దన్నాడులే... మధ్య త్రోవలో రెండు వాంతు లయ్యాయిటగా! ఆఁ నిద్ర వస్తున్నట్టుంది- ఆ గుఱ్ఱపుశాలలో పక్క వేయించాలే ... అక్కడికిపోయి పరుండు" అంటూ వెళ్ళిపోయింది.

'విజ్ఞాని' నిలువునా కృంగిపోయాడు...అదే సమయాన అతనికి కోపం వుధృతంగా వచ్చిం వీరయ్యపై. ఏదో తన తెలివితక్కువ వల్ల ఒకరాత్రికి ఆపాటి అధికారం లభించిందని యెంత క్రూరంగా ప్రవర్తించాడు...తనకి తిండికూడా పెట్టవద్దన్నాడే! ఇంత బ్రతుకు బ్రతికి చివరికి గుఱ్ఱపుశాలలో పడుకోవటమా? ఒరేయ్ వీరయ్యా! ఎంత దుష్టుడివిరా! అయినా నువ్వేం చేస్తావులే! పరిస్థితులు కల్పించిన వాణ్ణి నేను...అనుకుని చాలసేపు విచారించాడు విజ్ఞాని.

మొదట్లో అనుకున్న విధంగా తెలతెలవారుతుం దనగానే నకిలీ విజ్ఞాని భవనంనుండి బయటపడ్డాడు. వచ్చేస్తున్నప్పుడు అత్తకి మరికొందరికి చెప్పాడంతే! అసలు విజ్ఞాని కూడా గుఱ్ఱపుశాలనుండి బయటపడ్డాడు గుఱ్ఱంతోసహా. ఇద్దరూ తెల్లవారేసరికి వూరు పొలిమేరలు




## ఎర్రబొట్టూ, నల్లబొట్టూ

ఒకప్పుడు మనదేశాన్ని 'సూక్ష్మబుద్ధి' అనే మహారాజు పరిపాలించేవాడు. అతడు ఎరగని శాస్త్రమూ లేదు, అతనికి తెలియని ధర్మమూ లేదు. రాజకీయంగాగాని సాంఘికంగాగాని శాస్త్రరీత్యాగాని ఎటువంటి విషమసమస్య వచ్చినా అతడు నిముషాలమీద స్వయంగా పరిష్కరించేసేవాడు. సూర్యకాంతం పువ్వుకి సువాసనకూడా లభించినట్లు - అతనికి మనస్సా నచ్చిన 'బుద్ధిశాలి' అనే బ్రాహ్మణుడు మంత్రిగా లభించాడు. ఈ యిద్దరూ కలసి రెట్టింపయిన బుద్ధిబలంతో తమ కాలాన్ని స్వర్ణయుగంగా, తమ పరిపాలనని రామరాజ్యంగా చేశారు. కాని దైవబలం ముందు బుద్ధిబలమనగా ఎంత? అయిదురోజుల జ్వరంతో 'బుద్ధిశాలి' హఠాత్తుగా మరణించాడు. ఎందుకూ పనికిరాకపోయిన తన సామర్థ్యాన్ని చూసుకొనే సరికి సూక్ష్మబుద్ధికి చెప్పలేని విచారం కలిగింది. బుద్ధిశాలివంటి నీతిశాలిని బ్రతికించుకోలేని తనికి రాజ్యమెందుకు? ఈ తాశత్రయమెందుకు? ప్రాణమిత్రుని బ్రతికించుకోలేని తన కీవివేకమెందుకు? కుడిచెయ్యిని పోగొట్టుకున్న తను తిరిగి అడ్డులేకుండా పరిపాలించగలడా? ఆ స్థానమెవరయినా భర్తీ చెయ్యగలరా? అని సర్వం త్యజించడానికి సిద్ధపడగా రాజపురోహితుడయిన 'ధర్మబుద్ధి' అతనిని వారించాడు.

'మనస్సు మార్చుకో మహారాజా! దేవుడిమీద, విధి మీద అలిగి మనం ఏంచెయ్యగలం? బుద్ధిశాలి నిజంగా గొప్ప బుద్ధిమంతుడే. కాదనలేము. కాని అతనికీ ప్రపంచంలో పని అయిపోయింది. అతని కోసం రాజ్యాన్ని ప్రజల్ని వదులుకుంటావా మహారాజా!'

'మరేం చెయ్యను మహాత్మా? బుద్ధిశాలివంటి వివేకవంతుడు ఈ లోకంలో మరొకడున్నాడా? అతని స్థానం ఎవరైనా పూరించగలరా?'

'ఎందుకు లేరు మహారాజా? దేశం గొడ్డుపోయిందా? ఎవరిమాటకో ఎందుకు, బుద్ధిశాలి కొడుకులు లేరా?'

'వారు తండ్రి అంత బుద్ధిమంతులా?'

'తండ్రిని తలదన్నే తెలివిమంతులు'

'నిజంగానా?'

'పరీక్ష చెయ్యండి. గెల్చినవాడికి మంత్రిపదవి చాటించండి అంతేగాని యిదేం న్యాయం మహారాజా!'

### అవసరాల రామకృష్ణారావు

---

దాటిపోయారు ... అక్కడ ఎవరి మనుష్యులు వారు మార్చుకున్నారు... తనకి తిండిలేకుండా చేసినందుకు వీరయ్యని ఎడా పెడా తిట్టాడు విజ్ఞాని. వీరయ్య ఏం జవాబు చెప్తాడు? బిక్క మొహం వేశాడు.

"ఏమోనండీ! నే నసలు అమ్మగార్ని చూడనే లేదు. నా కిచ్చిన గదిలో యిలా కూర్చుండిపోయాను" అన్నాడు వీరయ్య. నిజానికి జరిగింది కూడా అదేనూ. విజ్ఞానికి కావల్సిందీ అదే! తరవాత ఇద్దరూ ప్రయాణం సాగించారు అష్టకష్టాలు పడతారట.

—సింగారకథ సమాప్తం.

## ★ సమస్యలతోరణం ★

అంతే. ఆనాటినుంచీ పరీక్షలు ప్రారంభమయ్యాయి.

కీ. శే. బుద్ధిశాలి ముగ్గురు కొడుకులూ పిలిపించబడ్డారు.

వారిపేర్లు వరుసగా తెలివి, అతి తెలివి, మహాతెలివి.

ఎన్ని చిత్రమయిన ప్రశ్నలు వేసినా, ఎన్ని చమత్కార సమస్యలు సాధించమన్నా, ముగ్గురూ వెంటనే ఒక్కసారే జవాబు చెప్పేసేవారు!

ఈ యువకుల తెలివి తేటలు చూసి రసికుడయిన సూక్ష్మబుద్ధి మహారాజు తన విచారమే మరచిపోయాడు. వీళ్ళలో అందరికన్న తెలివైనవాడు ఎవరో అది ఎలా తెలుసుకోడమో ఆ మహారాజు కొక సమస్య అయికూర్చుంది!

ఆఖరికి ఆరాజు సమీపంలో ఉన్న సప్తపండితులతో సంప్రదించి ఒక విచిత్రమయిన పరీక్ష ఏర్పాటు చేశాడు. అది ఇది.

ముగ్గుర్నీ ఒక గదిలోకి పిలిపించాడు. ముగ్గురికళ్లూ గంతలు కట్టేశాడు. తరువాత వాళ్ల ముగ్గురికీ నుదుట మూడు బొట్లుపెట్టి ఇలా చెప్పేడు.

'చూడండి అబ్బాయిలూ! నేను మీ ముగ్గురికీ ఎరుపు బొట్టుకాని నలుపు బొట్టుగాని ఏదో ఒక రంగు బొట్టు పెట్టేను. ఇప్పుడే మీ గంతలు విప్పించి వేస్తాను. గంతలు విప్పించినా ఎదుటివారి బొట్టు తప్ప తనబొట్టు ఎవరికీ కనిపించదు గదా! మీ ముగ్గుర్నీ కూర్చో బెట్టి గంతలు విప్పేస్తాను. ప్రతివాడూ తక్కిన యిద్దరి బొట్లలోనూ ఏ ఒక్కరిది ఎఱ్ఱటి బొట్టయినా చాలు వెంటనే లేచి నుంచోవాలి. ఇలా జరిగిన తరువాత ఎవడు ముందు తన రంగు చుక్క ఫలానారంగుది అని చెబుతాడో వాడే మహామంత్రి!'

ఈ విధంగా బోధపరచి రాజు వాళ్ల కళ్ల గంతలు విప్పించాడు.

ముగ్గురూ వెంటనే లేచి నిలబడ్డారు.

ఒకటి రెండు నిమషాలు అతి భారంగా గడిచాయి.

'నా బొట్టు రంగు ఎరుపు రంగు!' అని మహాతెలివి గట్టిగా అరిచాడు.

ఆ మాట నిజమే.

మహాతెలివిని మహామంత్రిగా చేశారని మళ్లీ చెప్పనక్కర్లేదు.

అంతా బాగానే వుంది. సమస్య మాత్రం అక్కడే ఉండి పోయింది.

రాజు ఎవరి నుదటను ఏ రంగు బొట్టు పెట్టేడు?

తన బొట్టు రంగు ఎరుపని మహాతెలివికి ఎలా తెలిసింది?

అదే మనం చెప్పుకో వలసిన సమస్య. ★

(జవాబు వచ్చేసంచికలో చూడండి.)



 # భంగపడిన రాగబంధం 

(12-వ పేజీ తరువాయి)

"మరి భోజనం చేశారా?"

"చేశానండీ"

ఆమె పట్టుకొచ్చిన "అన్నాకెరినినా!" తెలుగు అనువాదం టేబిలుమీద పెడుతూ "బడలికగా ఉందంటూనే ఏమిటో చాలా పత్రికలు చదువుతున్నారు" అని అడిగింది.

"లేదు పూరికే చూస్తున్నా...మీరా నవల పూర్తి చేశారా?" అని అడిగాడతను.

"చదివాను, ఆ అన్నానుచూస్తే జాలి వేస్తుంది"

"నవల చదివితే జాలివేస్తుంది ఆవిడమీద. కాని అదే లోకంలో యధార్థంగా జరిగితే అటువంటి స్త్రీని లోకం కొట్టిపోస్తుంది." అన్నాడతను ఉద్వేగంగా.

ఆమె కేదో సందేహం కలిగి ఏమో అడగాలనుకుంది. కాని మౌనం వహించింది. అతను తల అటు తిప్పి కిటికీలోంచి బైటికి చూస్తున్నాడు. సంభాషణను మారుస్తూ "సరళ ఎప్పుడొస్తుందీ" అని అడిగింది ఆవిడ.

అతను కొంచెం పెద్దగా నవ్వి "ఆవిడ పుట్టింటికెళితే మళ్ళీ తిరిగొచ్చే సంగతి ఆమెకు జ్ఞాపకం ఉండదు" అన్నాడు వెటకారంగా.

"అదేమిటి, అలా అంటారు"

"ఆవిడ సంగతి అంతే. నేనే ఉత్తరం ద్వారా జ్ఞాపకం చెయ్యాలి"

అంతటితో ఆమె సంభాషణముగించి తన ఇంట్లోకి వెళ్ళి కొంతసేపటికి తిరిగివచ్చి కాఫీగ్లాసు టేబిలుమీద పెట్టి వెళ్ళిపోయింది.

విజయలక్ష్మి వెళ్ళిపోతూవుంటే మహాలక్ష్మమ్మగారు ప్రక్కనేవున్న వాళ్ళ వాకిట్లోకివచ్చి ప్రత్యేకంగా దర్శనమిచ్చారు. మనిషి చూడబోతే ఏదోనిగూఢమైన విషయాన్ని ఆరా తీస్తూవున్న అపరాధ పరిశోధక శిఖామణిగా కన్పించింది. అయినా విజయలక్ష్మి కలవరపడకుండానే వెళ్లిపోయింది. ప్రకాశరావు కాఫీ త్రాగి గ్లాసుపట్టుకొని గది తలుపుదగ్గరికివచ్చి దానిని ఎలా విజయలక్ష్మికి అందజెయ్యాలా అని ఆలోచిస్తూ అప్రయత్నంగా మహాలక్ష్మమ్మగారి వాకిలివైపు చూచాడు. ఆవిడ అక్కడే నిలబడివుంది. అతనివైపు అదో మాదిరిగా నిక్కచ్చిగా చూచింది. కొంపతీసి ఇందాకటి నుంచీ విజయలక్ష్మితో జరిగిన సంభాషణ వినలేదుగదా. అయినా ఏం జరిగింది కనుక ఆవిడ విన్నదని భయపడ్డానికి. ఇలా అనుకున్నాడేకాని మహాలక్ష్మమ్మగారి లాంటి మనిషి ఏ కాస్త ఆధారం దొరికినా చిలవలు పలవలు కల్పించగలదని అనుమానించాడు. అయినా తానేమీ తప్పుచేయనప్పుడు అనవసరంగా కంగారుపడడ మెందుకని మనసు దిట్టం చేసుకున్నాడు. ఆనాటినుంచీ మహాలక్ష్మమ్మగారిని కనిపెట్టే మసులుకుంటున్నాడు.

నెలరోజులు గడిచాయి. ప్రకాశరావు ఆశించని విధంగా అత్తవారింటినుంచి ఉత్తరం వొచ్చింది. సరళే వ్రాసింది, ఆదివారం ఉదయం ఎక్స్‌ప్రెసుకు వస్తున్నానని. ఇలా సరళ తనకైతాను రావడం విశేషంగానే వుందనుకున్నాడు.

ఆదివారంనాడు పిల్లలతో సరళ వొచ్చేసింది. విజయలక్ష్మి వచ్చి ఆవిడ పుట్టింటి క్షేమ సమాచారాలు అడిగిపోయింది. ఆవిడ అటు పోవడం చూచి మహాలక్ష్మమ్మగారు సరళ ఇంట్లోకివచ్చి "సరళా, ఇదేనా రావడం" అని ఆప్యాయంగా ప్రశ్నించింది.

"అవును మామ్మగారూ" అంటూ సరళ దగ్గరి కొచ్చింది.

మహాలక్ష్మమ్మగారు ప్రకాశరావు కూర్చునే గదిలోకి ఓమారు చూచి అతను ఇంట్లో లేడని తేల్చుకున్న తరువాత సరళతో మెల్లగా "మంచిపని చేశావు. త్వరగా వచ్చి నీ సొమ్ము నీవు దక్కించుకున్నావు" అంది రహస్యాన్ని వెల్లడిస్తున్నట్టుగా.

"అదేమిటి మామ్మగారూ, సొమ్మేమిటీ, దక్కించుకోడమేమిటీ" అని ఆదుర్దాతో అడిగింది.

"సరే, ఇంకా నీకు బోధపడనేలేదు. నెల్లాళ్ళనుంచీ ఎంత గ్రంథం నడుస్తూందో తెలుసా?"

ఈ మాటవిని సరళ తెల్లబోయి చూస్తూవుంది. మహాలక్ష్మమ్మగారు గది తలుపు వేస్తూ సరళను చెయ్యిపుచ్చుకుని అవతలి గదిలోకి తీసుకెళ్ళి కంఠం బాగా తగ్గించి "నీభర్తను కాస్త అదుపులోవుంచుకో. ఏం పోయినా వస్తుందిగాని మొగుడి మనసు పోతేరాదు. చిన్నవయస్సులో వున్నావు. నా కూతురులాంటి దానివి కాబట్టి చెబుతున్నా ఆ మీ స్నేహితురాలితో ఈయన ఏం వికవికలూ, ఏం పకపకలూ! ఇటువంటిది ఎప్పుడూ ఇక్కడ జరగలేదు. అయినా ఆడదానికి సిగ్గూ బిడియమూ లేక పోయిన తరువాత మగవాడి తప్పేముంది? ఏమైనాతే ఒకరి సంగతి నాకెందుకుగాని ఏదో నీబాగు కోసం ఇంతగా చెప్పాను" అంటూ మళ్ళీ ఇవతలిగది వాకిట్లోకివచ్చి మెల్లగా తలుపు తీసి "వెళ్తానమ్మా సరళా" అంది బిగ్గరగా. సరళ ఆమెను అనుసరిస్తూ ఏమీ బదులు మాట్లాడలేక విజయలక్ష్మి వాళ్లవాకిలివైపు ఈసులో చూసి లోపలి కెళ్లింది. ఎన్నడూ లేనంతగా ఆమె మొహం వివర్ణమైంది.

ప్రకాశరావు మధ్యాహ్నం పన్నెండు గంటలకి బజారునుంచి వొచ్చాడు. భోజనానికి కూర్చున్నాడు. సరళ మొహంలో ఏదో గంభీరతచూచి మొదట కొంచెం అనుమానించినా ప్రయాణపు బడలికవల్ల అలా వుండేమోలే అనుకొని స్థిమితపడ్డాడు. యధాప్రకారం సరళ వొడ్డించింది. భోజనాల తరువాత అతను వాళ్ళ పుట్టింటి విశేషాలేమిటని అడిగాడు. ఆవిడ ఏదో పరధ్యానంగా సమాధానం చెప్పింది. తరువాత అసలు విషయాని కొచ్చింది. వాళ్లిద్దరికీ చాలాసేపు వాదం జరిగింది. చివరకిద్దరూ ఒక నిర్ణయాని కొచ్చారు. అతను మనసారా అంగీకారం తెలుపడం తోటే సరళ మనస్సుకూడా తేలికై ఉదయంనుంచి పడ్డకలత శమించింది. వాళ్లిద్దరికీ ఏమని ఒప్పందం జరిగిందో కాని ఆనాటినుంచీ ప్రకాశరావు మళ్లీ విజయలక్ష్మి ఇంట్లో అడుగుపెట్టలేదు. ఆవిడతో మాట్లాడ లేదు. సంగతి గ్రహించినట్లుగా ఆవిడ ప్రకాశరావు వైపు చూచేది. కారణమేదో తెలుసునన్నట్లుగా మహాలక్ష్మమ్మగారిని పరికించేది. తన యుక్తి పారినందుకు మహాలక్ష్మమ్మగారు ఏదో ఘనవిజయం సాధించినంతగా ఉప్పొంగిపోయింది. ఆరోజుతో ఆరెండు అద్దెవాటాల మధ్య ఏర్పడిన రాగబంధం మాత్రం భంగపడింది. 

"ఏమిటోయ్. గంటన్నర నించి, వాడితో కబుర్లాడుతున్నావ్."

"ఏదో మంచీ చెడ్డాలే."

"నీ తలకాయ. మీరు మాట్లాడుకునేదాంట్లో మంచేముంటుంది?...ఉత్త చెత్తాకారీ సంగతులగురించి చర్చ అఘోరిస్తారు."

"సంగతు లాట్టే లేవు లే. ఏదో నీ విషయం ప్రస్తావనకొచ్చింది. దానిమీదే చర్చ."

(24- వ పేజీ తరువాయి)

తోపిస్తే అది మీ చేత్తో యిప్పించండి" అని బామ్మని ప్రాధేయంగా అడిగింది. మా బామ్మ గొంతుకలో పచ్చి వెలక్కాయ పడ్డాది. మా అమ్మ గుడ్లప్పగించి అదే పనిగా ముసలమ్మని చూసింది. ఇద్దరూ పల్లెత్తు మాట్లాడ లేదు.

ముసలమ్మ చాలీ చాలని కొంగుని భుజం మీద చిన్న మూట పెట్టుకుంది. ఆ మూటని చూపించి, "ఇదిగో మీ పొరుగుంటి మా లక్ష్మమ్మగారు బియ్యం పట్టుకెళ్ళమన్నారు. ఆవిడకా బుద్ధి దేవుడు పుట్టించేడు. మాకు మూణ్ణాలుగు రోజులు దాకా కడుపునిండా తిండానికి సరిపోతాయి" అని చెప్పింది.

"మీ మనవడేడీ?" అడిగేడు నాన్న.

"లోపలికి రారా అంటే మొహం చెల్లక వీధిలో నిల్చుండిపోయేడు" అంది ముసలమ్మ. వీధి గుమ్మంపక్కనుంచీ దొంగలాగ తొంగి చూసేడు రామారావు.

"ఇలారా అబ్బాయి" అని నాన్న పిల్చేడు. వాడు జంకుతూ లోపలికొచ్చేడు.

"ఇదిగో నీ చొక్కా నిక్కరూ" అని నాన్నే వాడి చేతిలో పెట్టేసేడు. దాగరంత మొహంతో వాడు వాటిని తీసుకున్నాడు.

"అవ్వగారూ ఇదిగో మీ రూపాయి" అని ముసలమ్మకి రూపాయి యిచ్చేసేడు.

"మీ యిల్లు వెయ్యి మొదళ్లై తండ్రీ ఎప్పటికీ వృద్ధిలోకి రావాలి. పాత్ర ఎరిగి దానం చెయ్యమన్నారు పెద్దలు. నాలాంటి దానికి యిస్తే కోటిగుణితం అవుతుంది" అని ముసలమ్మ ఆశీర్వదిస్తూ రూపాయి పుచ్చుకుంది.

"దీని కోసమని మళ్ళా వచ్చేరా? మంచివారే! ఇవ్వడానికి పిల్లలైతే నేం? మెం అయితే నేం?" అన్నాది బామ్మ.

"ఏ గూటి చిలక ఆ పలుకు పలుకుతుంది. మీ బుద్ధే మీపిల్లల కొచ్చింది" అన్నాది ముసలమ్మ.

"వాళ్ళ తాతగారి పోలికే దానం ధర్మం వాడికి పుట్టుకతో నే వచ్చేయి" అన్నాదమ్మ. తమ్ముడు ఫకాల్న నవ్వేడు.

పళ్లు కొరుక్కుంటూ, "ఏంవిటా వెధవ నవ్వు నోరుమూసుకు ఉండు" అన్నాది బామ్మ.

"ఇవాళ శివుడు నాలో ఉండి మీకూ మీపిల్లలకీ మామీద యింత దయ చూపించేడు. మీరు చేసిన సాయం ఎన్ని జన్మలకీ మర్చిపోను. యిహా నింటికెళ్ళి కుర్రవాగమ్మ కుడకేసి పెట్టాలి. అక్కగారూ వెళ్ళొస్తాను," అని చెప్పి ముసలమ్మ వెళ్ళిపోతానంది.

"మంచిది. వెళ్ళిరండి" అన్నాది బామ్మ.

"మీ దయవల్ల సంవత్సరంపాటు మావాడికి గుడ్డముక్క కరువు లేదు. మీరు రూపాయిచ్చేరా! మరి రెండు రూపాయిలుంటే ఈ నెల వాడి జీతానికి ఇబ్బంది రాదు. ఏదో మీ అందరూ తలో పిడికెడూ యిస్తూ ఉంటే ఎలాగో ఈడ్చుకొస్తున్నాను. చెట్టంత కొడుకుని పొట్టని పెటుకుని ఈ రాత తెచ్చుకున్నాను. వెళ్లొస్తాను తల్లీ వెళ్ళొస్తాను. బాబూ వెళ్ళొస్తాను. మీ మేలు మరిచిపోలేను." అని చెప్తూ కళ్ళనిండా నీళ్లు పెట్టుకుని, "వెళ్లొస్తాను అక్కగారూ" అని బామ్మలో ఆఖర్న ఏడుస్తూ చెప్పి చచ్చిపోయిన కొడుకుకోసం ఏడుస్తూ వెళ్ళిపోయింది.

"ఇచ్చిసేనని అంత హంగామా చేసేరు తిరిగి పుచ్చుకోలేక పోయేరా?" అన్నాడు తమ్ముడు.

"అదొకటి తక్కువైంది" అన్నాదమ్మ.

"నువ్వూ నీ కొడుకూ కలిసి రూపాయే యిచ్చుకోండి. పది రూపాయిలే యిచ్చుకోండి. నా రూపాయి మాత్రం నాకిచ్చిక పోతే ఒప్పుకోను" అంది బామ్మ.

"వెనిస్తే నేమిటి నా పిల్లలిస్తే నేమిటి అని యిప్పుడే అన్నావు కదుటే అమ్మా." అన్నాడు నాన్న.

"అద్దిగదిఅద్దిగది" అని గంతేడు తమ్ముడు.

"ఎలాగ తయారవాలో అలా తయారౌతారులే నీ పిల్లలు" అన్నాది బామ్మ.

"రేపు నేనూ యింకేదన్నా యిచ్చేస్తానుండండి" అంది అక్కయ్య.

"అలా యిచ్చిడానికి అందరికీ చేతులు రావు" అన్నాడు నాన్న. ★

## అలవాటు

ఒకయువ రచయిత జార్జి బెర్నార్డ్ షా ఇంటికి వెళ్ళి, ఎలాగో ఆయనను ఒప్పించి, తన రచన వినిపించసాగాడు. కొంతసేపటికి, కిటికీ తలుపు చప్పుడైతే, ఆ రచయిత తల ఎత్తి చూచాడు. షా తలుపు తీస్తున్నాడు.

"పక్కింటి వాళ్లు వినాలని కిటికీ తీస్తున్నారా" అని అడిగాడు రచయిత ఉత్సాహంతో.

"అబ్బే. కాదోయ్. నిద్ర వచ్చినపుడు కిటికీ తలుపులు తీసుకోవడం నాకు అలవాటు" అన్నాడు షా బద్ధకంగా.



Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.

# ఆరోగ్యవంతులైన జనులు ప్రతిరోజూ లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయుదురు

## —అది ప్రతిదిన*మలినములోని క్రిములను కడిగివేయును!




*మనకు ప్రతిదినం తాఱ్పడేమామూలు మురికిలో క్రిములున్నాయి. మనలో ప్రతివారికీ యీక్రిములవల్ల రోగాల ప్రమాదంవుంది. అందుచేతనే చాలా మంది ఆరోగ్యవంతులగు జనులు లైఫ్‌బాయ్ సబ్బుతో మురికిని మరియు క్రిములను రోజూ కడిగివేసుకొనుటవల్ల తమ ఆరోగ్యమును కాపాడుకొను చున్నారు—అది ఆరోగ్యవంతమయిన హాయిని గలిగించును.

L. 256-X52 TL

భారత దేశంలో తయారు చేయబడినది.



అందాల చుక్కలు

—ఫోటో : పి. గురుమూర్తి.

# 43 లక్షల యిండ్లను కట్టుటకు పునాది ఎంత దిట్టమైనది వేయాలి ?

కొన్ని సంవత్సరములనుండి అనేకమంది గ్రామవాసులు పట్టణములకు పోయారు ఈ పట్టణములలో వీరు దుర్భరమైన పరిస్థితులలో అద్దె యిండ్లలో క్రిక్కిరిసి నివసించుచున్నారు అసలే యిండ్లు చాలక పోవుటచే వీరి రాక కరువులో అధిక మాసమువలె వచ్చినది మన పట్టణాలలో యిండ్లకరువును దీర్చుటకు అధమం 43 లక్షల యిండ్లనైనా కట్టవలెను

**1947** వ సం॥లో భారతదేశపు సిమెంటు వుత్పత్తి **14 5** లక్షల టన్నులు కాని యీనాటి వుత్పత్తి **43 4** లక్షల టన్నులు, అనగా **1947**వ సం॥కంటె నేటి వుత్పత్తి సుమారు మూడు రెట్లు హెచ్చయిన దన్నమాట ఈనాడు **26** ఆధునిక సిమెంటు ఫ్యాక్టరీలు సామర్థ్యముగా నడుప బడుచున్నవి. ఈ ఫ్యాక్టరీలలో **40,000** మంది పని చేయుచున్నారు

ఆర్థికాభివృద్ధికి ఉక్కు ఎంతైనా అవసరము అందుచేతనే తాతా కంపెనీవారు ఉక్కు వుత్పత్తిని రెట్టించుటకు విస్తరణ కార్యక్రమము నమలు పరచుచున్నారు

| తాతా కంపెనీ వారి ఉక్కు వుత్పత్తి | |
|---|---|
| 1955 | 10,50,000 టన్నులు |
| 1959 | 20,00 000 టన్నులు |




దేశాభివృద్ధికి ప్రయివేటు పరిశ్రమ తోడ్పడచున్నది

ది తాతా ఐరన్ అండ్
స్టీల్ కంపెనీ లిమిటెడ్